# మా న వీ రు లు

(విప్లవయోధుల జీవితాలు)

(మూడో భాగం)



గద్దె లింగయ్య

ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

ఇందులో :

భగవతచరణ్
నళినీ బాగ్చి
మణీంద్రనాధబెనర్జీ
మహావీరసింగ్
చంద్రశేఖర ఆజాద్

# భగవతీచరణ్

భారత దేశ టెర్రరిస్టు వుద్యమంలో కాలము గడచిన కొలదీ పరిణామము కలుగుతూ వచ్చింది. ఆదినుండి బెంగాలు ప్రధానపాత్ర వహిస్తుంటే, వివిధ రాష్ట్రపార్టీలు విభిన్న దృక్పధములతో పనిచేస్తుండేవి. 1928 సం॥లో పంజాబు, యు. పి. రాష్ట్ర విప్లవనాయకులు ఒకే కేంద్ర పార్టీని 'హిందూస్తాన్ సోషలిష్టు రిపబ్లికన్ ఆర్మీ' అను పేరుతో స్థాపించి శాఖలేర్పరచిరి. అదివరకు చీటికీ మాటికీ చేయుచున్న హత్యలను, దోపిడీలను ఖండించినారు. ప్రజాదృష్టి నాకర్షించగల్గుటకు మాత్రం చాలతక్కువగా బాంబు ప్రయోగాలుచేయ నిశ్చయించారు. భారత దేశంలో సోషలిష్టు ప్రజా ప్రభుత్వ స్థాపనే లక్ష్యంగాపెట్టుకొని పనిచేశారు.

పార్టీ కార్యక్రమము ననుసరించి చంద్రశేఖర ఆజాదు నాయకత్వంలో సర్దార్ భగత్‌సింగ్ ప్రభృతులు సాండర్సును హత్యచేసి, అసెంబ్లీలో బాంబువిసరి నిర్బంధింపబడినారు. తర్వాత వైస్రాయి ఇర్విను ప్రయాణంచేస్తున్న రైలుక్రింద బాంబు పేల్చినారు. నిర్బంధింపబడిన భగత్‌సింగ్ వగైరాలను జైలునుండి తప్పించుటకు విఫుల సన్నాహములుచేసి, అందుకు కొత్తరకం బాంబులను తయారుచేశారు. వాటిని పరీక్షించుటలో ఒకదాని ప్రమాదమునకు గురియై హతుడైనాడు భాయీ భగవతీ చరణ్.

భగవతీచరణ్ గుజరాతునుంచి ఆగ్రావచ్చి స్థిర నివాసమేర్పరచుకున్న బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడు. తండ్రి రైల్వేకంపెనీలో వున్నతోద్యోగిగా పనిచేసి ధన మును కూడబెట్టినాడు. కేవలం ధనోపార్జనయే కాక రావు సాహేబు బిరుదమునుకూడ సంపాదించుకొనినాడు.

కుమారుడు ఆంగ్లవిద్యా విశారదుడై తనవలె ఉన్న తోద్యోగము నిర్వహించి ధనము సంపాదింపవలెనని తండ్రి కోరిక; కాని, భగవతీచరణ్ 1921 సం॥ లో గాంధీజీ పిలు పుతో ఇతర విద్యార్థులతోపాటు చదువుకు స్వస్తి చెప్పాడు. విద్యార్థిదశయందు పాఠ్యపుస్తకములేకాక ఇతర రాజకీయ పుస్తకములు చదివెడివాడు. విద్య చాలించుటతో రాజకీయ గ్రంథావలోకనము మరింత అధికమైనది. ఆదినుండి అతడు తీవ్రవాది. 1922 సం॥ లో రష్యన్ విప్లవాన్నిగూర్చి తెలుసుకున్నాడు. భారతదేశంలో విప్లవాన్ని తెచ్చి నూతన వ్యవస్థను స్థాపించాలని వుబలాటముతో పనిచేయసాగినాడు. 1922 సం॥ లో కాన్‌పూరు కుట్రకేసు సందర్భంలో కమ్యూ నిష్టులు అరెస్టుచేయబడినప్పుడు భగవతీచరణ్ ఇల్లుకూడా సోదాచేయబడినది. అప్పుడు అరెస్టు చేయబడకున్నా ప్రముఖుడుగనే ఎంచబడుచుండెను.

ఆ రోజులలో కమ్యూనిస్టుపార్టీ శాఖ లేర్పడి పని చేయుటలేదు ఉత్తరదేశంలో టెర్రరిస్టు వుద్యమము తీవ్రంగా చెలరేగుతూవుంది. భగవతీచరణ్‌ను టెర్రరిస్టు

వుద్యమము ఆకర్షించింది. వుత్సాహోద్రేకములు పొంగి పొంగులెత్తూవున్న కాంగ్రెస్సు కార్యక్రమములో పాల్గొనినాడు.

మిత్రులతో కలసి లాహోరులో మకాము పెట్టాడు. సహచరులు చదువుతూవుంటే తానున్నూ తిరిగి కాలేజిలో చేరినాడు. మేధాశక్తిచేతనూ, క్రియాపటుత్వమువల్లనూ భగవతీచరణ్ పంజాబు విప్లవదళంలో ప్రముఖస్థాన మలంకరించాడు. సంయుక్తరాష్ట్రమున కేగి అచట విప్లవ నాయకులగు కాకోరీ కుట్రకేసుఖైదీలను తప్పించుటకు ప్రయత్నించ గోరెను. కాని, వారిలో స్వార్థపరుల ప్రాబల్యము హెచ్చుగుటవల్ల అతనిమాట చెల్లినదికాదు.

భగవతీచరణ్‌కు బాల్యంలోనే వివాహమైనది. బాల్యవివాహాలవల్ల పతీపతుల ప్రేమకు అంతరాయము కలుగుట సహజమైనా, భగవతీచరణ్ విషయంలో అట్టిది జరుగలేదు. అతని పత్ని దుర్గాదేవి పతి కన్నివిధముల సహచారిణియైనది. ఆమెకూడ పార్టీ సభ్యురాలై నిరంతరకృషి చేయసాగినది.

భగవతీచరణ్‌కు పిత్రార్జిత సంపత్తి పుష్కలంగా సంక్రమించినా నిరాడంబరజీవి. అవసర సమయాల్లో తన సంపత్తిని లెక్కలేకుండా పార్టీకి వినియోగించెడివాడు. తనకు కుమారుడున్నాడని ధనవ్యయంలో సందేహించేవాడు కాదు. వేలాది దరిద్ర కుటుంబముల కాదరువు కల్గించు ప్రయత్నంలోనున్నవారికి స్వకుటుంబమును గూర్చిన సంకుచితాభిప్రాయం ఎలావుంటుంది ?

లాహోరు కుట్రకేసులో భగవతీ చరణ్ కూడ ముద్దాయిగా చేర్చబడినాడు. వారంటు వెలువడినది; కాని, పట్టుబడకుండా తప్పించుకొని పనిచేస్తున్నాడు. ప్రభుత్వమతని యాస్తిపాస్తులను జప్తుచేసినా భగవతీచరణ్ చింతించలేదు. సతీపతు లిద్దరూ అచంచల దీక్షతో, నిరంతరము పనిచేస్తూనే వుండిరి.

లాహోరు కుట్రకేసుతో పార్టీబలం కొంత తగ్గినా కార్యక్రమాన్ని కుంటుపడకుండా ఆజాద్, భగవతీచరణ్‌లు సాగించుతూనే వచ్చారు. లాహోరులో తన యింటనున్న బాంబుఫ్యాక్టరీ పట్టుబడిన అనంతరం భగవతీచరణ్ మకాం మార్చి 'యశపాలు'తో కలిసి ఢిల్లీని కేంద్రముగా చేసికొని పనిచేయసాగేడు. వైస్రాయి ప్రయాణంచేయుచున్న రైలుబండి క్రింద బాంబు ప్రేల్చుట కేర్పాటుచేశారు. ఈ బాంబు సంఘటనను ఖండించు లాహోరు కాంగ్రెసు తీర్మానములను, గాంధీజీ స్టేటుమెంటును విప్లవవాదులు సహించలేకపోయారు. అప్పుడు భగవతీచరణ్ 'బాంబువాద' మను కరపత్రాన్ని మితవాదధోరణికి సమాధానంగా ప్రకటించాడు. ఆ కరపత్రమునుబట్టి భగవతీచరణ్ కేవలం రాజకీయవిజ్ఞానం లేక బాంబువాదమును గుడ్డిగా నమ్మినవాడు కాడనీ, ప్రజా దృష్టి నాకర్షించుటకే వారట్టి కార్యక్రమును నవలంబించినా, వర్గరహిత సమాజసృష్టికి ప్రజాసంఘటనలో విశ్వాసము కలిగియున్నాడని స్పష్టమైనది.

రైలుబండి క్రింద బాంబు పేల్చిన తరువాత ముఖ్యులందరూ తిరిగి లాహోరులోనే స్థావరమేర్పరచుకున్నారు. కొత్తగా ఒక బాంబు ఫ్యాక్టరీ స్థాపించారు. జైలులో మగ్గుచున్న భగత్సింగు మున్నగువారిని నిర్బంధమునుండి తప్పించుటకు పెద్దఎత్తున దాడిచేయ నిశ్చయించుకున్నారు. అందుకు ప్రత్యేకం ఒక నూతనరకం బాంబుల్ని తయారు చేశారు. ఇతర ఆయుధసామగ్రికూడ ఆయత్తపరచుకున్నారు. 1930 జూన్ ఒకటో తేదీని సెంట్రలు జైలు పైకి దండెత్తుటకు నిర్ణయించుకున్నారు. అందుకు కావలసిన సన్నాహములన్నీ చురుకుగా జరుగుచున్నవి. మే 28 తేదీ సాయంత్రం ఆజాద్, దుర్గాదేవి, సుశీలాదేవి, వగైరాలు ఆయుధాలన్నిటిని బయటికితీసి శుభ్రము చేస్తున్నారు. అప్పుడు తాము నూతనంగా తయారుచేసిన క్రొత్తరకం బాంబు ఎలా పనిచేయునో పరీక్షించి చూద్దామని భగవతీచరణ్, సుఖదేవరాజ్, వైశంపాయనులు నగర బహిర్భాగమునకు రావీనది ఒడ్డున నిర్జనారణ్యప్రదేశానికి వెళ్ళారు. పరీక్షించదలచిన ఆ క్రొత్తబాంబును ఎవరికివారే తాము విసరవలెనని వైశంపాయన్, సుఖదేవరాజులు వాదించుకొనుచుండ, భగవతీచరణ్ దానిని గైకొని తానే విసరబోయినాడు; కాని విధి వేరొకవిధంగా నిర్ణయించింది. అది చేతిలోనే బ్రద్దలైపోయినది.

బాంబు పేలుటయే తడవుగ భగవతీచరణ్ ముంజేయి ఎగిరిపోయినది. డొక్కమీద పెద్ద దెబ్బ

తగిలినది. సుఖదేవరాజు కాలుపైన గాయమైనది. వైశం పాయన్‌కూడ గాయపడినాడు. వారిద్దరు రక్తంలో క్రింద పడిన భగవతీచరణ్ గాయాలకు తమ కట్టుగుడ్డలు చించి కట్లుకట్టారు. అతనిస్థితి చాల ప్రమాదంగావుంది. వైశం పాయన్ సహచరునివద్ద కాపుండ, సుఖదేవరాజు కుంటు కుంటూ మకామునకుపోయి అక్కడున్నవారికి ప్రమాదవార్త నెరిగించెను.

యశపాల్, ఛైలబిహారీలు తక్షణమే బయలుదేరి సంధ్యచీకట్లో వెతుక్కుంటూ ఘటనాస్థలమునకు చేరు కున్నారు. వైశంపాయన్ ముఖముపైన నీరు చిలకరింప భగవతీచరణ్ కళ్ళుతెరచి దిగాలుపడియున్న మిత్రులవంక చూచి 'నేను భయపడ్డానని తలుస్తున్నారా?' అన్నాడు. ఆ స్థితిలోకూడ, మరల స్ఫృహతప్పుటచూచి సహచరు లాతనిని నదిఒడ్డుకు చేతులపై మోసుకొనిపోవ పైకెత్తగనే కట్టుకదలి పొట్టమీది గాయాన్నుండి రక్తము బొలబొల కారసాగినది. శిరము వ్రేలాడిపోయినది. వెంటనే క్రిందికి దించి కట్టు సరిచేశారు. మంచంమీద తీసుకొనిపోవుటే మార్గమని తలచి యశపాల్, వైశంపాయనులు బయలు దేరారు.

ఛైలబిహారీ టోపీతో నీరు తెచ్చి భగవతీచరణ్ శిరమును తొడపైన పెట్టుకొని ముఖంమీద నీరు చిలకరించు చుండెను. గాయములనుండి రక్తము స్రవించుతూనేవుంది. తల ఒక ప్రక్కకొరిగి వ్రేలాడినది. స్థితి విషమించినట్లు

గ్రహించి శైలబిహారీ గాభరా పడ్డాడు. పలుకరించి చూచాడు; ఒకసారి, రెండుమార్లు, మూడు పర్యాయాలు; కాని, ప్రత్యుత్తరం లేదు. అతడు భీతిల్లిపోయాడు. తొడపై నున్న శిరమును క్రిందపెట్టి అడవి బయటికి పరుగెత్తాడు. గావుకేకలతో మిత్రులను పిలిచాడు. వా రిప్పటికే చాలా దూర మేగియుండుటచే పలుకలేదు. శైలబిహారీ వెనుకకు మరలి భగవతీచరణ్ దగ్గరకు వెళ్ళాడు.

సహచరునిఒళ్ళో ఉండగానే భగవతీచరణ్ ప్రాణం పోయింది. ఘోరాంధకారంలో, అరణ్యమందు అతని శవ మా వీరోచిత ఆత్మత్యాగమును ప్రదర్శిస్తూ పడివుంది. శైల బిహారీ తిరిగి వచ్చి ఆ వీరుని పవిత్ర శవసన్నిధిని మోక రిల్లాడు.

శైలబిహారీ లేచి రివాల్వరును చేతబట్టి టార్చిలైటు వెలుగును శవప్రదక్షిణముచేయిస్తూ రెప్పవాల్చక చూస్తు న్నాడు. ప్రియమిత్రుని మరణము! కటిక చీకటి!! నిర్జనారణ్య ప్రదేశము!!! అతని కేమిచేయుటకును తోచకున్నది. పట్ట ణంలో సహచరు లెంత చింతిల్లుతారో అన్న ఆవేదన! అప్పు డతని మనఃస్థితి ఎట్లా ఉంటుందో ఊహించండి!

చాలసేపటివరకు తటపటాయించి, వెళ్ళి మిత్రు లెంత సేపటికిని తిరిగి రానందున, అక్కడేమి గందరగోళం జరిగినదో ఎక్కడ తమ రాకపోకలు గూఢచారుల కంటపడెనో యన్న సందేహ మాతనిని బాధించసాగింది.

ఇంకా వూరికే అక్కడ వుంటే ప్రయోజనంలేదని తన టోపీని భగవతీచరణ్ ముఖంమీద కప్పి చుట్టూవున్న చెట్లనే కాపలాఉంచి నగరాభిముఖుడైనాడు.

శైలబిహారీ భగవతీచరణ్ మరణవార్త వినిపించగా అదివరకే విచారగ్రస్తులైవున్న సుశీల, దుర్గాదేవి మున్నగు వారెంత ధైర్యోపేతులైనను కన్నీరు మున్నీరుగా కార్చిరి. అందరూ ముఖాలు వంచుకుని విచారగ్రస్తులైవుండగా చంద్రశేఖర ఆజాద్ "ఏడ్చుట కిది సమయముకాదు. కర్తవ్య మాలోచించవలె"నని హెచ్చరించాడు. అంతలో అంధకారముచే దారితప్పి ఘటనాస్థలమున కాలస్యముగాపోయి విగతజీవుడైన సహచరునిగాంచి యశపాలు, వైశంపాయనులు తిరిగి వచ్చిరి.

స్వాతంత్ర్య యోధాగ్రణిని, అమూల్య సహచరుని కోల్పోయినందుకు వారెల్లరును శోకసంతప్తహృదయులైనారు. ఆ పవిత్ర శవమునకు దహనసంస్కారమైనా చేయుటకు వీలులేదు అసలే రహస్య జీవితము! అందులో అరణ్యం!! అదెట్లు సాధ్యమగును? తెల్లవారితే మరీ చిక్కు. ఆజాద్, యశపాలులు వెళ్ళి కోడి కూయకముందే రావీనది ఒడ్డున శవాన్ని పూడ్చిపెట్టారు.

భగవతీచరణ్ మరి సహచరులమధ్యలేదు. భారతమాత తన వీరపుత్రులలో ఒకనిని కోల్పోయింది. అయినా అతని స్మృతి మన స్వాతంత్ర్యయోధులకు మరింత వుత్సాహమును కలిగించింద. ఆ విప్లవవీరుడు చిరస్మరణీయుడుకదా!

---

# నళినీ బాగ్చీ

విప్లవదీక్ష బూని మన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని బలిపీఠంమీద ప్రాణం కోల్పోయిన అజ్ఞాతవీరులలో నళినీ బాగ్చీ ఒకడు. ఆత్మత్యాగానికి ప్రతిఫలంగా తన నామ స్మరణనైనా కోరని త్యాగి అతను. విద్యార్థిదశలోనే నళినీ విప్లవోద్యమంలో అడుగుపెట్టాడు. విద్యార్థులను విప్లవోద్యమంలో చేర్చుతూండేవాడు.

1915 సం॥లో విప్లవ ప్రయత్నాలన్నీ విఫలమై వందలాది దేశభక్తులు ఘోరశిక్షలకు గురియైనపుడు ప్రభుత్వ నిర్బంధజాలంలో చిక్కుకోకుండా వున్న వారందరూ సమావేశమై పునఃప్రయత్నం చేయటానికి నిశ్చయించుకున్నారు. అట్టివారిలో నళినీ ఒకడు. పార్టీ బలహీనంగా వున్న ప్రాంతాల్లో విప్లవసంఘాలు సంఘటితమొనర్ప పూనుకొన్నారు. నళినీబాగ్చీ బీహారుకు ఆర్గనైజరుగా పంపబడ్డాడు.

నళినీ భాగల్పూరు కాలేజీలో విద్యార్థిగ చేరాడు. ఆవిధంగా అచటి విద్యార్థులతో సంబంధ మేర్పరచుకొని కార్యసాధనకు ప్రయత్నించసాగాడు. అక్కడ తన వేషాన్ని మార్చి పక్కా బిహారీవలె తయారయ్యాడు. కట్టు-జుట్టు మార్చాడు. అయినా కొన్నాళ్ళకు గూఢచారులతన్ని గుర్తుపట్టారు.

కాలేజీలో వుండటం మరి క్షేమంకాదని నళినీ భాగల్పురమును వదలి రహస్యంగా బీహారుప్రాంతమంతటా తిరుగుతూ పనిచేయసాగాడు. అతని కా క్రొత్త ప్రాంతంలో నా అన్న

వారు లేరు. దాగియుండుటకు ఆశ్రియమే చిక్కదయ్యేను. అందుచే చేయునది లేక స్వరాష్ట్రానికే మరలవలసి వచ్చెను.

వంగదేశమందును అప్పుడు నిర్బంధవిధానము తీవ్ర రూపము దాల్చియున్నది. విప్లవవాదులు మసలుటకే వీలు లేకుండావుంది. నళినీవంటివారు బెంగాలులో ఉండటం ఆపదను కోరి తెచ్చుకున్నట్టే. వృధాగా పట్టుబడి ఏం ప్రయోజనం? దేశాని కేంచేసినట్టు? కాబట్టి తాత్కాలికంగా తప్పించుకొని కొంతకాల మెక్కడైనా తల దాచుకోవలసినదిగా నళినీ పార్టీచే ఆదేశింపబడ్డాడు.

నళినీబాగ్చి నలుగు రైదుగురు సహచరులతో అస్సాం రాష్ట్రానికి వెళ్లిపోయాడు. గౌహతిలో ఒక అద్దెయింట మకాం పెట్టి రోజులు వెళ్ళబుచ్చుతున్నారు వారివద్ద తూటాలతో రివాల్వరు లెప్పుడూ సిద్ధంగా వుండేవి. దూర ప్రాంతంలో ఎవరూ ఆనవాలుపట్టనిచోట ఒక గదిలో వుంటున్నా అత్యంత జాగరూకతతో మెలగుచుండిరి. తామున్న గదివద్ద ఎప్పుడూ ఎవరో ఒకరు పహరాయిచ్చు చుండేవారు. నిర్బంధ వాతావరణము చల్లబడి మళ్ళీ విప్లవధ్వజ మెత్తి స్వాతంత్ర్యాగ్నిని ప్రజ్వలింపజేయుటకు పూనుకొనవచ్చునీ, అవసరమయితే బలికావచ్చునీ ఆ వీరయువకులు అంత జాగ్రత్త తీసుకొనుచుండిరి.

కలకత్తాలో పట్టుబడిన ఒక పందద్వారా పార్టీ రహస్యాలన్నీ - నళినీ ప్రభృతుల వునికితోసహా ప్రభుత్వానికి తెలిసి పోయాయి. 1917 జనవరి 9 వ తేదీని పోలీసు సిబ్బంది తగు సాధనములతో హఠాత్తుగా గౌహతిలో విప్లవయువకులున్న

యింటిని ముట్టడించెను. మిట్ట మధ్యాహ్నం అందరూ నిద్రలో వున్నారు. కిటికీలో కూర్చుండి ఒకయువకుడుమాత్రం పహారా యిస్తూనే వున్నాడు. ఏదో చదువుకుంటూన్న ఆ యువకుడు వెంటనే ప్రమాదాన్ని గ్రహించి సహచరులను మేల్కొల్పి శత్రువుల రాకను తెలియజేశాడు. వారు కంగారుపడలేదు. ఆశ్చర్య మంతకంటేలేదు. అట్టిది ఏ క్షణంలోనైనా జరుగ వచ్చునని ఆ యువకు లూహించి యుండకపోలేదు. బయటికి పోయి పోలీసులపైకి ఢనాఢన్ మంటూ ఫైర్ చేయ సాగించారు ఆ యువకులా రీతిని ధైర్యముతో సాహసించి తస్కా రింతురని పోలీసులు కలనైనా తలచియుండలేదు. సబ్బా గడ్డికరచే పరస్పరభుశ్యాదేశము లో స్వాతంత్ర్యయోధుల ధైర్య మిట్లా బోధపడుతుంది! వారి ఆకస్మిక ఆక్రమణతో పోలీసు సిబ్బంది చెల్లాచెదరైనది. ఆ అవకాశంలో యువకులు సమీపములోవున్న ఒక కొండపైకి పారిపోయారు. తర్వాత ప్రభుత్వభటులందరూ కుమిగూడి జరిగినదానికి పశ్చా యించారు. అంతమంది వుండికూడా నలుగురైదుగురు యువ కులను పట్టుకొనలేక పిక్కబలం చూపినందుకు తమలో తామే సిగ్గుపడ్డారు. వారిని వెంబడించి పట్టుకొనితీరాలని ప్రతిన బూనారు.విప్లవవాదు లెక్కినకొండ నన్నివైపులనుండి చుట్టు ముట్టారు. అప్పటికే సాయంత్రమయింది. కొండపైనున్న యువకులును పోరాటమునకు సిద్ధమయ్యారు.వుభయులకు తీవ్ర సమర మారంభమైనది. తుపాకులు రివాల్వరులు ప్రేలిన ధ్వనితో ఆకాశము ప్రతిధ్వనించినది లెక్కకు కొన్నిరెట్లు తక్కువగా వున్న శత్రువులతో అయిదుగురు ఎంతసేపు పోరాడ

గలరు! మసకచీకటి క్రమ్మునప్పటికి వారిలో ముగ్గురు హతులై నేలకొరిగారు. మిగిలినది నళినీబాగ్చి, మరొక యువకుడు. వారింక పోరాడి ప్రయోజనంలేదని పోలీసులకళ్ళలో దుమ్ముకొట్టి మరొకదిక్కుకు ఫరారైనారు. నళినీ పర్వతారణ్య ప్రాంతములో దారితెన్నుగానక ప్రయాణం జేస్తున్నాడు. శత్రువులతోడి పోరాటంలో అతడు గాయపడియుండుటచే అసహ్య వేదనతోనే నడచిపోతున్నాడు. అట్టిస్థితిలో గోరుచుట్టుపైన రోకటిపోటురీతి అరణ్యంలో ప్రయాణం చేయుచుండగా నళినీని విషకీటకమేదో కాటువేసినది. రక్తంలో విషం వ్యాపించి మరింత బాధించసాగినది. ఆకలి-దప్పులతో వేధింపబడుతూ, గాయము బాధించుచుండ, విషము విపరీత వేదనను కల్గించుతూండగా పొదలు, తుప్పలు, వాగులుదాటి ఎట్లెట్లో బీహారు చేరుకున్నాడు. అక్కడ అంతకుముందునుంచి పోలీసులు అతని కొరకు వెదకుతూనే వుండిరి. అందుచే నళినీ మరల వెంటనే బయలుదేరి బెంగాలుకు వెళ్ళాడు. నళినీ అసహాయస్థితిలో హౌరాస్టేషనులోదిగాడు. అచట ఎరిగినవారు ఎవరూ కన్పించరైరి. శరీరంలోశక్తి క్షీణించిపోయింది. అప్పటికే కడుపునిండా ఆహారం తిని వారంరోజులైంది. ఆయాసంతో తూలిపోతున్నాడు. విషకీటకంకాటుఫలితంగా ఒడలంతటా పొదలు బయలుదేరాయి. అందుకుతోడు జ్వరంకూడా ఆవేశించింది. ఒక్కసారిగా అన్ని కష్టము లెదురైనప్పు డాతని స్థితి యెట్లుండునో వూహించుడు. ఏమి చేయుటకును తోచకుండెను. ఎక్కడికైనా పోదమన్నను శక్తి కానీ లేదు!

నడచుచున్న త్రాణలేక కాళ్ళు తేలిపోతున్నై. గూఢ చారుల భయము వుండనేవుంది అప్పుడాతనికున్న ఆధరువు తోటాలతో నిండియున్న రివాల్వరు ఒక్కటే. అప్పుడతను చేయునదిలేక ఎట్లో కాళ్ళీడ్చుకుంటూ ఫోర్టు మైదానంలోకి చేరుకున్నాడు. ఆపైని ఒక్క అడుగైనా ముందుకు వేయలేక ఒక చెట్టుక్రింద కూలబడ్డాడు. దేశదాస్యమును నిర్మూలింప దీక్షవహించిన ఆ ధీరున కెట్టి గతిపట్టినదో చూడండి! ఆ దేశభక్తుడు లేవలేని స్థితిలో ఒక చెట్టుక్రింద పడివుంటే ప్రక్కన పరిచర్య చేయువారు లేరు సరికదా, పలుకరించు దిక్కైనా లేకపోయింది. అంతేగాదు. ఎవరుచూస్తే ఏమి ప్రమాదము సంభవించునోయన్న అదటుకూడాను. నళినీ ఆ విధంగా రెండురోజులవరకు ఆ చెట్టుక్రిందనేపడియున్నాడు. రెండోరోజున సాయంకాలమున నళినీ నెరిగియున్న ఒక విప్లవవాది యేదో పనిమీద ఆ మైదానముగుండా వెళ్ళటం తటస్థించింది. ఆతడు దిక్కుమొక్కులేక పడియున్న నళినీని చూచాడు. అతని దుస్థితి కా యువకుడు దూరముగాపోయి కన్నీరు కార్చాడు. గూఢచారు లెక్కడ గమనింతురోయని సమీపమునకైనా పోక చీకటిపడువరకు కొంచెము దవ్వున వేచియుండి, తర్వాత నళినీవద్దకు వెళ్ళాడు. అప్పుడొకట కిరాయిబండికూడా కనవయింది. అతడు నళినీని భుజముమీద వేసుకొని మెల్లగా తన యింటికి తీసుకొనివెళ్ళాడు. పక్కమీద పరుండబెట్టి దీపపువెల్తురులో పరీక్షించి చూచాడు. నళినీ శరీరమునేగాక ముఖాన్నికూడా పొక్కలు కప్పివేశాయి. అతని నాలుక పనిచేయుటలేదు. తర్వాత మూడు రోజుల

వరకు నళినీ మాటా, పలుకూ లేకుండానే పడివున్నాడు. ఆ స్నేహితుడు నళినీ దుస్థితికి దుఃఖించుతూ పరిచర్యచేశాడు. చికిత్సకు డాక్టరును మాత్రం పిలువలేకపోయాడు. గుట్టు బయటపడుతుందన్న భీతితో యితరుల కెరిగింప వెనుకాడినాడు. నళినీస్థితిచూస్తే గుండె నీరైపోతోంది. ఒంటిమీద పొడలు భయానకంగా వున్నాయి. రసికారుతూ అసహ్యంగా వుంది. ఆ పొడలె నళినీని పొట్టనుపెట్టుకునేటట్టుంది స్థితి. ఏమిచేయుటకును పాలుపోక ఆ యువకుడు అనాలోచితంగానే పసుపున పొడలమీద అద్దాడు. అంతకంటే వేరే మందూ - మాకూలేదు. నిత్యము పసుపు పులిమి మర్దనచేస్తూ మజ్జిగ మాత్రం తాగించుతూవచ్చాడు. అదృష్టవశాత్తు ఆ పసుపే పనిచేయసాగింది. విషం విరిగిపోయి పొడలు మానుపట్టసాగాయి. ఏమాలోచక చేసినపనే నళినీకి గొప్ప చికిత్సగా వుపకరించింది. అతడు క్రమంగా ఆరోగ్యవంతుడై కోలుకొనజొచ్చెను. నళినీ ఆ రీతిని మృత్యుముఖంనుండి తప్పించుకున్నందుకు అతన్ని కాపాడిన మిత్రు డపరిమితానందము పొందినాడు.

అన్ని ఇక్కట్టు లనుభవించినా, మరెన్ని చిక్కులు తటస్థించినా నళినీ ధైర్యచ్యుతుడు కాలేదు. ఇంకను దేశసేయ చేయవలసియున్నందుననే మృత్యువు తన్నుపీడి దూరంగా తొలగిపోయిందని తలిచాడు. లేచి తిరుగగల ఓపికరాగానే పార్టీ పునఃసంఘటనకు పూనుకున్నాడు. కొడిగట్టిన విప్లవజ్యోతికి మళ్ళీ చమురు పోశాడు. నళినీని

కాపాడిన మిత్రుడును అతనికి తోడుగా పనిచేస్తున్నాడు. కాని, ఒకరోజున నళినీకి ఆ అండ కూడా లేకుండా పోయింది. ఆ మిత్రుడు అరెస్టుచేయబడ్డాడు నళినీ హౌరాలో ఒకగది నద్దెకు తీసుకొనివుంటూ పనిచేయుచునే యున్నాడు. తారిణీ మజుందారు అను వేరొక సహచరుడు కూడ వచ్చి కలిశాడు. ఇద్దరూ అద్దె గదిలోనే వుంటూ యువకులను సంఘటితపరుచుచున్నారు. స్వాతంత్ర్య యోధుల జీవితంలో సుఖం కల్ల. శాంతికి తావేవుండదు. అనతి కాలంలోనే నళినీ బాగ్చి పైన మరొక విపత్ పర్వతము విరిగి పడినది. అతనిమార్గంలో అడుగడుగునా ముళ్లే! ఎంత జాగ్రత్తగా ముందుకు పోదామన్నను, ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట ఏదో ఒక ముల్లు గుచ్చుకుంటూనే ఉంటుంది. వారి జీవితపథమట్టిది! 1918 సం॥ జూన్ పదిహేనో తేదీ వుదయం నళినీబాగ్చి, తారిణీ మజుందారు లిద్దరూ కాలకృత్యములు నివృత్తిచేసుకొని గదిలో మాట్లాడుకుంటుండగా గౌహాతిలో వలెనే పోలీసు లాయింటిని చుట్టుముట్టారు. ఆ వీరద్వయానికి శత్రువుల సంఖ్యాబలం భీతిలేదు. జంకుగొంకు లేకుండా సాహసంతో ఎదిరించి తప్పించుకొనదలిచారు. ఉభయ పక్షముల నుండి గుండ్ల వర్షము కురిసినది. శత్రువుల గుండ్లకు గురియై మజుందారు తక్షణమె వీరస్వర్గ మలంకరించినాడు. నళినీకి కూడ ఒక దెబ్బ తగిలింది. కాని, అత నంతమాత్రానికి చలింపక పోరాడుతూనే పారిపోవుటకు ప్రయత్నిస్తున్నాడు. అంతలో మరొక రవ్వ వచ్చి తగిలింది. ఆ దెబ్బతో నళినీ నేల కొరిగిపోయాడు. రెండవదెబ్బ బలంగా తగులుటచే మరి

లేవలేకపోయినాడు. ప్రాణం నిలచునున్న ఆశకూడ లేదు. ఆ అవసానదశలోనే నళినీని పోలీసులు అరెస్టుచేశారు. నళినీ హాస్పిటలులో మంచంమీద పడివున్నాడు. పోలీసు అధికారులతనిచుట్టూ మూగారు. వారికా యువకుడు ఫలానా అని తెలియదు. విప్లవవాది అను అనుమానంతోనే అతనిని అరెస్టుచేశారు. అతని వూరూ, పేరూ, ఇతర వివరాలూ తెలుసుకోవాలని ఎన్నోసార్లు ప్రశ్నించారు. కాని నళినీ శత్రువుల కొక్క అక్షరమైనా ఎరిగింప ఇష్టపడలేదు. తుదకు స్వాతంత్ర్య బలివేదికమీద ఆహుతియగుచున్ననూ తన పేరునైనా ఆ అంతిమ ఘడియల్లో వెల్లడించుటకు నిరాకరించాడు. చెప్పు, చెప్పుమని పదేపదే వేధించుతున్న అధికారులతో, నన్ను విసిగించక శాంతితో ప్రాణం విడువనివ్వండని మాత్రం అన్నాడు. నళినీబాగ్చి స్వాతంత్ర్యవ్రతం పూని అజ్ఞాతజీవితంలో అనేక కష్టాలు అనుభవించాడు. తానెవరో, ఎందుకు మరణించెనో అన్న వివరములుకూడా అజ్ఞాతంగానే ఉంచదలిచాడు. తాను సోదరదేశీయుల నిమిత్తం బలిఅయిపోయినాడు. కాని, దేశీయులు తన్ను స్మరించి ఒక్క కన్నీటిబొట్టు రాల్చకపోయినా ఆ త్యాగికి యిష్టములేకపోయింది.

ఈ స్వార్థమయ ప్రపంచంలో నళినీవంటి స్వార్థత్యాగి జీవితము ధన్యముకదా!

---

(3)

# మణీంద్రనాథ బెనర్జీ

మాతృదేశ దాస్యవిమోచనకు సామ్రాజ్యశక్తి నెదిరించి పోరాడిన యోధులే జైలులోకూడ ఆ సామ్రాజ్యవాదుల జులుమును ప్రతిఘటించి అస్తమించినఅమరమూర్తులు జతీంద్రదాసూ, ప్రాంశీలజమా, మహావీరసింగుల కీర్తిచంద్రికలు దిగ్దిగంతములవరకు వ్యాపించినవి. అట్టివాడే మణీంద్రనాథ బెనర్జీ.

మణీంద్రుడు మహానాయకుడు కాడు. అతడు విప్లవవాది. ఆ రోజుల్లో 'విప్లవవాది' అనేది సర్వసామాన్యమైపోయింది కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన తర్వాత గాంధీ టోపీ తగిలించిన ప్రతివాడూ విప్లవవాదిననే చెప్పుకుంటున్నాడు. మణీంద్రుడట్టి విప్లవకారుడు కాడు. విప్లవవాది అనడమంటే ఇనుపగుగ్గిళ్ళు నములుటగా వున్న యుగంలోని విప్లవవాది. అప్పటి విప్లవవీరు లడుగడుగునా అగ్నిపరీక్షల కాగవలసివచ్చేది. అట్టి విప్లవజీవి మణీంద్రుని మరణం కూడ విప్లవాత్మకమే.

మణీంద్రుని దేశాని కర్పించిన కుటుంబాలాంటివి చాల అరుదుగా వుంటాయి. అతని తాత హరిప్రసన్న బెనర్జీ ఆంగ్లవిద్య నభ్యసించి డిప్యూటీ కలెక్టరుగా పనిచేసినా స్వాతంత్ర్యాభిలాషి. తాను ప్రభుత్వానికి దాస్యంచేస్తున్నా తన సంతానంకూడ బానిసబ్రతుకు బ్రతకడం ఆయన కిష్టంలేదు. ఉన్నతోద్యోగుల అడుగులకు మడుగులొత్తుతూ తన కుమారులు ఉచ్ఛిష్టమును కుడువకూడదనుకున్నాడు. ఆ వుద్దే

క్రాంతిలోనే తనయుడు తారాచరణ్ బెనర్జిని వైద్యవృత్తిలో ప్రవేశపెట్టాడు.

తారాచరణ్ బెనర్జీ కాశీలో వైద్యవృత్తి నవలంబించి మంచి పేరు ప్రఖ్యాతులు గడించాడు. నెలకు అయిదువందల రూపాయలకు పైగా రాబడి వుండేది. ఆయన వైద్యవృత్తి ద్వారా ప్రజాసేవ చేయుటే కాక, కాంగ్రెసులో జేరి యథాశక్తిని పనిచేయువాడు. బెంగాలులో పబ్లిక్ ప్రాసిక్యూటరు రజనీకాంత బెనర్జి తన ప్రియసుత సునయినీదేవిని తారాచరణునికిచ్చి వివాహంచేశాడు. ఆమె ఒక ప్రభుత్వోద్యోగి తనయ యయ్యూ దేశసేవాభిలాషిణి. భర్తృపదసేవ చేస్తూ ఇల్లు చక్కబెట్టుకుంటున్నను వార్తాపత్రికలు చదువుతూ, దేశ దుస్థితిని, తాత్కాలిక రాజకీయములను చక్కగా అవగాహన చేసుకొనుచుండెడిది. భర్త కాంగ్రెసుకార్యక్రమాన్ని ప్రజలలో ప్రచారంచేస్తుంటే, ఆయమ తమ గృహంలోనే అమలుపర్చేది. విదేశీవస్తు బహిష్కారవ్రతం పట్టి, వాకిట్లో 'విదేశ వస్తువు లుపయోగించువారికి లోనికి ప్రవేశం లేదు.' అని వ్రాసిన అట్ట వ్రేలాడగట్టింది. ఒకపర్యాయం ప్రభుత్వదాస్యంలో మునిగి తేలి ఫించను పుచ్చుకుంటున్న తన తండ్రి విదేశీ వస్త్రధారియై రాగా, సునయినీదేవి ఆయన్ను లోనికి అడుగు పెట్టనివ్వలేదు. హరిప్రసన్నుడు విదేశ వస్త్రములను త్యజించి ఖద్దరుధారియై వచ్చినతర్వాతనే పితృప్రేమతో ఆహ్వానించింది. ఇట్టి పుణ్య దంపతుల కడుపున 1907 జనవరి 13 వ తేదీన మణీంద్రుడు పుట్టినాడు. మణీంద్రుని జనని తన 'ఎనిమిదిమంది కొడుకులకు ఉగ్గు

పాలతో దేశభక్తిని రంగరించిపోసి పెంచింది. బాల్యంనుంచే వారికి దేశసేవా పాఠమును నేర్పినది. 'బిడ్డలను సింహాలను చెయ్యాలన్నా, కుంకేళ్ళను గాపించాలన్నా కన్నతల్లి చేతిలో పనే' ననేది మణీంద్రుని మాతృదేవి. అట్టి తల్లిగన్న సంతానం దేశసేవలో లీనమగుటలో వింత ఏముంది ? సున యినీదేవి 1920 లో గాంధీజీ సత్యాగ్రహం ప్రారంభించగానే వయస్కుడగు కుమారుడు ప్రభాస బెనర్జీని ఉద్యమంలో ప్రవేశపెట్టింది.

విద్యావంతుల కుటుంబంలో జన్మించిన మణీంద్రుకు బెంగాలీ, హిందీ,ఆంగ్ల భాషలను సులువుగానే అభ్యసించాడు. అనేక అన్య గ్రంథాలనుకూడ చదువుతూండేవాడు. దేశ రాజకీయాలు వారియింటిలో క్రొత్తవి కానేకావు. అతడు విద్యాభ్యాసం చాలించకముందే మేనత్తకొడుకు సురేంద్ర చటర్జీతో కొంతకాలముండుట తటస్థించినది. సురేంద్రబాబు కుర్రిస్టు అయ్యీహూడా ఇంటునున్న చేయబడి ఆధ్యాత్మిక గ్రంథావలోకనం చేస్తుండేవాడు. ఆయనపత్నికూడ భగవద్భక్తిగలది. ఆ దంపతులయందు భక్తిభావ మేర్పడి మణీం ద్రుడు క్రమంగా ఆధ్యాత్మికవాది యైనాడు. నిత్యము యోగాసనంలో కూర్చుండి భగవధ్యానము చేస్తుండేవాడు. ఉపనిషత్తులు, గీత చదువుతుండువాడు. వేదాంతుల [illegible] కొన్ని చదివి [illegible].

[illegible] ఒక వంక [illegible] తల్లిదండ్రుల [illegible] లేదు. [illegible]

డెల్లా దేశము దాస్యములోవుంటే యువకులు నిర్వీర్యుల వగి దిని ముక్కుమూసుకొని ధ్యానములో లీనమైవుండుటకంటె భారత జాతికి వేరే దౌర్భాగ్యములేదని తీవ్రముగా విమర్శించేది. నెమ్మదిగా మణీంద్రుని దృష్టిని రాజకీయాలవైపుకు మళ్ళించినది. ఆమె టెర్రరిస్టు సంఘములో సభ్యురాలు కాకున్నను కాశీ విప్లవదళనాయకుడు రాజేంద్రనాథ లహరితో పరిచయమున్నది. మణీంద్రుని కాయనతో పరిచయము చేసినది. అప్పటినుంచి లహరి యిచ్చు విప్లవసాహిత్యాన్ని చదువుతూ, ఆయన ప్రోద్బోధముచే 16 ఏళ్ళ వయస్సులోనే రహస్యసంఘములో సభ్యుడైనాడు.

మణీంద్రుడు విప్లవదళములో చేరినా నాయకు లతణ్ణి బాలునిగా ఎంచి ఏపనీ చెప్పేవారుకాదు. కాకోరీ రైలు దోపిడీ సందర్భములో ముఖ్యులెల్లరూ పట్టుబడుటో, ఫరారగుటో తటస్థించువరకు అతడెట్టి సాహసచర్యలను పూనుకొనుటకును అవకాశము చిక్కలేదు. కాకోరీ కుట్రకేసు విచారణ సాగుతుంటే బయటనున్న నామమాత్రపు నాయకుల వెంటబడి ఆయుధమిస్తే తమ నాయకులను హింసించుతున్నవారి పని పట్టుతానని అడిగాడు. కాని క్రియారూపములో ఏమీచేయక కేవలము విప్లవవాదుల మనిపించుకుంటూ నాయకులులేని పార్టీకి నాయకత్వము వహించియున్నవారేదో నెపముతో మణీంద్రునికి ఆయుధము లివ్వకనే జరుపుతూవచ్చారు. మణీంద్రుడు ఒకరిద్దరు నూతన సభ్యులతో కలసి ఆయుధసేకరణకు విశ్వప్రయత్నము చేస్తూనే వున్నాడు.

1927 డిశంబరు 17 – 19 తేదీలలో రాజేంద్రలహిరి బిస్మిల్, అశఫాక్, రోషన్ సింగులు వురితీయబడ్డారు. రాజేంద్ర బాబును పరప్రభుత్వం వురితీసినదన్న వార్త మణీంద్రుని హృదయములో పిడుగులా తగిలింది. సామ్రాజ్యవాదులు విప్లవోద్యమాన్నణచివేయుటకు నల్గురు నాయకులను వురితీశారు. ఆ నాయకులు చూపిన మార్గమనుసరిస్తున్న యువకులింకనూ చాలమంది వున్నారని మణీంద్రుడు ప్రభుత్వానికొక పాఠము నేర్పాలనుకున్నాడు. కాకోరీ నాయకుల వురిశిక్షలకు ముఖ్యముగా డి. వై. ఎస్. పి. జితేంద్ర బెనర్జీయే కారకుడు. అతణ్ణి హతమార్చి ప్రభుత్వముమీద కక్షతీర్చుకోవాలనుకున్నాడు. ఇంతకూ తన వుద్దేశ్యాన్ని నెరవేర్చుటకు ఆయుధముకావాలి. తంటాలుపడి ఎక్కడో రివాల్వరుకూడ సంపాదించాడు. మణీంద్రునితోపాటు ఆపనిలో పాల్గొనుటకు మరొక యువకుడుకూడా సిద్ధమయ్యాడు; కాని వున్నది ఒక్కటే రివాల్వరు, రెండు తూటాలు మాత్రమే.

రివాల్వరు లభించినది లగాయతు మణీంద్రుడు డి. వై. ఎస్. పి. ని కడతేర్చే ప్రయత్నంలోనే వున్నాడు. అతని రాక-పోకలను, విరామ - విహారాలను గమనించసాగాడు. ఒక పర్యాయం మణీంద్రుడు గోధూమివద్ద సాయంసంధ్య వేళ కాచుకొని వున్నాడు. వాహ్యాళి ముగించుకొని వస్తూన్న జితేంద్రబెనర్జీని చూచి జేబులో చెయ్యిపెట్టి చూచుకున్నాడు. రివాల్వరు సిద్ధంగానే వుంది. తన కార్యసాధనకదే తగినసమయమని అధికారివైపుగా నడిచాడు. ఇక జేబునుండి రివాల్వరు తీయుటే ఆలస్యం. అరె! అంతలో తలెత్తి చూస్తే మణీంద్రుని కన్న

వైపులా బెనర్జీ రూపమే కన్పింపసాగింది. అదే తలంపుతో ఏకాగ్రచిత్తుడై వుండుటవల్ల మానసిక వికృతిచే అట్లయినది. మణీంద్రుడు మరి చేయునదిలేక అప్పటికి తనప్రయత్నాన్ని విరమించుకొనవలసి వచ్చింది.

మరొకసారి మణీంద్రుడు ఆ అధికారిని ఒక రిద్దరు సన్యాసులతో వేదాంతవిషయము చర్చించుతూ నడుస్తున్నప్పుడు చూచాడు. మరి ఆ అవకాశాన్ని జారిపోనీయక మణీంద్రుడు రెండంగల్లో డి. వై. ఎస్. పి. ని సమీపించి రివాల్వరును గుండెకు సూటిగా గురిపెట్టి 'రాజేంద్రబాబు వురికి బహుమతి యిదుగో!' అంటూ కాల్చాడు; కాని ఆ గుండు గుండెకు తగలక భుజాన్ని తాకినది. ఇంక ఒక్క తూటామాత్రమే వున్నది. మణీంద్రుడు తత్క్షణమే ముందు కురికి రెండవసారి కాల్చాడు. అదికూడా హృదయానికి తగులనే లేదు. పొట్టలో మాత్రం తగిలింది. మణీంద్రుడు వున్న రెండు తూటాలు అయిపోయిన తర్వాత రివాల్వరు దూరముగా విసరివారవేశాడు. అనంతరము పోలీసు లెంతగా గాలించినా అది కన్పించనేలేదు.

మణీంద్రుడు నిర్బంధింపబడ్డాడు. పోలీసు సూపరింటెండెంటు చికిత్సబడసి చాలారోజులకు కోలుకున్నాడు. మణీంద్రునిచే పార్టీ రహస్యములు వెల్లగక్కించుట కెన్నో బాధలు పెట్టారు. భయపెట్టారు. ఆశ చూపారు. అయినా అతడచంచల దీక్షతో అన్నిటినీ ఎదుర్కొన్నాడు. తుదకు హత్యాప్రయత్నము చేసినందుకు పది సంవత్సరాల కఠినశిక్ష విధింపబడినది. కొన్నాళ్లు బెనారసు జైలులో వున్నతర్వాత

మణీంద్రుడు ఫతేహ్‌గఢ్ సెంట్రల్ జైలుకు బదిలీ చేయబడి నాడు.

మణీంద్రుడు జైలులో సామాన్య ఖైదీవలెనే చూడ బడినాడు. 1930 ఏప్రియల్‌లో జతీంద్రదాసు బలి ఫలితంగా ఏ. బి. తరగతులు ఏర్పడినా మణీంద్రుడు సి. క్లాసులోనే వుంచబడ్డాడు. పత్రికలూ, పుస్తకాలూ ఇవ్వరైరి. పరి శ్రమకూడ చెయ్యాలని నిర్బంధించారు. ఇవన్నీ స[illegible] వలేక మణీంద్రుడు నిరశనవ్రత మారంభించి జయించ[illegible] బి. క్లాసు ఇవ్వబడింది.

మణీంద్రుడు ఏకాకిగా వుండవలసి వచ్చినది. బి క్లాసులో అతడొక్కడే రాజకీయబంది. ఒంటరితనము కష్టము గా నేవున్నది. మళ్ళీ యోగాసనాలు ప్రారంభించి గంటలకొద్ది సమయాన్ని భగవధ్ధ్యానములో గడుపుతూండేవాడు. అంతే బయటి ప్రపంచములోని సాంఘిక రాజకీయ పరిస్థితులనుకూడ అర్థముచేసుకుంటున్నాడు. కేవలము భావోద్రేకములో జైలుకు పోయినవాడుకాడు. కారావాసములో అతని భావాలు మరింత మెరుగుతేలాయి. సంఘములో హెచ్చు-తగ్గు లుండకూడదని, వర్ణ వివక్షత లేకుండా వివాహాలు జరిగి సాంఘిక విప్లవముకూడ రావాలనీ కాంక్షించేవాడు. మణీం ద్రునికి మాతృదేవిపట్ల ఎనలేని ప్రేమ. జైలునుండి తల్లి కెన్నో లేఖలు రహస్యముగా వ్రాస్తూండేవాడు. ఆ జాబులలో అతని వున్నతాశయాలు ప్రస్ఫుటమవుతూండేవి. "తల్లు లందరూ రాజకీయాందోళనలో పాల్గొనాలి. నీవుకూడ వెల పాటుపడవు!" అని జననికి వ్రాశాడు. తన సోదరులు సత్యా

గ్రహోద్యమములో పాల్గొని శిక్షింపబడిన వార్త తెలిసి కొనుటకెంతో పుబలాటపడేవాడు. బంధుమిత్రులు తరుచుగా ఉత్తరాలు వ్రాయుచుండుకూ, పుస్తకాలు వెనువెంటనే పంప నందుకూ విసుగుకొనేవాడు. అధికారుల హింసల కంటె తనకు వరుసగా జాబులు రానందుకే అధికముగా బాధపడేవాడు. ఒకసారి జైలు చూచి వచ్చినవారికే ఆ బాధ బాగా అర్థ మవుతుంది.

మణీంద్రుడు ఆత్మాభిమాని. జైలులోవున్న అధి కారులకు దణ్ణాలుపెట్టడము, అయ్యా బాబూ అనటమంటే అతనికి ఒళ్ళుమంట. మణీంద్రుని ఈ నిర్లక్ష్యతను ఓర్వలేక అధికారులతనిని యెన్నోకష్టాలు పెడుతూండేవారు. విలియం అనే తెల్లవాడు చాలా నీచముగాకూడ మాట్లాడేవాడు. జైలరుగావున్న విలియం ఒకనాడు మామూలు ఖైదీలముందు మణీంద్రుని అవమానపరచాలని 'మేము భారతీయులను మట్టితో సమానముగా చూస్తాము' అన్నాడు. మణీంద్రుడు వెంటనే 'ఇంగ్లీషువాళ్ళను మేము పెంటతో సమానంగా తలుస్తాము' అని చుర్రుమనేటట్టు చెప్పుదెబ్బ కొట్టాడు. జాబు చెప్పాలనుకున్న జైలరు ఎదురుగుటకలు మ్రింగుతూ వెళ్ళి పోయాడు. అప్పటినుంచీ ఆ దురహంకారి నడవడి మార్చు కొని మణీంద్రునితో అతి మర్యాదగా ప్రవర్తించసాగాడు.

1931 సం॥లో మణీంద్రుని ఒంటరితనం ఎగిరిపోయి నది! కాకోరీకేసులో శిక్షింపబడిన మన్మథనాథ గుప్త రాకతో కాలము చర్చలతో సాగిపోసాగినది. క్రమముగా మణీంద్రుని యోగాసనాలు, భగవధ్యానము అదృశ్య

మయ్యాయి. దేశీయ, అంతర్జాతీయ రాజకీయాలను చర్చించడము, వివిధ భాషలను నేర్వటములో అతనికి హుషారుగా వుండేది.

తర్వాత అక్కడికి యశపాలు, యింకా యిద్దరు రాజకీయ బందీలుకూడా వచ్చారు. నాలుగు గోడల మధ్య మళ్ళీ ఒక విప్లవదళము తయారైనది. కాలము ఖులాసాగానే వెడుతున్నది; కాని మణీంద్రుడు నిరశన వ్రతము పూనినప్పటినుంచి అతని ఆరోగ్యము బాగుండలేదు. అసలా జైలు శీతోష్ణస్థితికూడ తనకు సరిపడుటలేదని మణీంద్రుడు తన బంధువులకు రాసిన జాబులలో పేర్కొన్నాడు. ఆరోగ్యము సరిగా లేకున్నను మిత్రులతో నిశ్చింతగానే గడుపుతున్నాడు.

1934 మే నెలలో చంద్రమసింగ్ అను రాజకీయ బందీని నిష్కారణముగా జైలు అధికారులు కొట్టించారు. ఈ అన్యాయాన్ని ఎదిరించుటకు ఏమి చేయుటా యని మణీంద్రుడు, మన్మథనాథ గుప్త, యశపాల్ వగైరాలు ఆలోచించుతూండగానే గోరుచుట్టుమీద రోకటిపోటులాగా రమేశచంద్రగుప్త అను మరొక ఖైదీకి రెండు వారాలు బేడీలు వేశారు. అతనిచే నిర్బంధముగా తిరుగలి తిప్పించసాగారు. రమేశుని రాజకీయ నిర్బంధితులమధ్యనుండి వేరే బ్లాకులోకి మార్చారు. ఈ అక్రమాన్నెదుర్కొనవలసిన అవసరము వచ్చినది. ఇంకనూ వేరే కారణాలు వుండనే వున్నవి. సి క్లాసు ఖైదీలు ముగ్గురూ, బి క్లాసులో నలుగురూ మే 14 వ తేదీని ఆహారము గైకొన నిరాకరించారు. అందరూ వేర్వేరు బ్లాకులలోకి మార్చబడ్డారు. తొమ్మిదవ దినాలు నిర

శన వ్రతము సాగించినమీదట అధికారులు లొంగివచ్చుటతో మే 28వ తేదీ రాత్రి ఆహారము తీసికొనుటకు అంగీకరించారు.

ఈ నిరశనవ్రతములో మణీంద్రుని మూత్రాశయము చెడిపోయినది అదివరకే అనారోగ్యముగావున్న మణీంద్రుడు స్వాస్థ్యము పూర్తిగా కోల్పోయినాడు. గదిలోని సిమెంటు అరుగుమీదనే జైలుదుప్పటి కప్పుకొని కూర్చొనుటతప్ప తిరుగలేని స్థితి వచ్చినది. మిత్రులెంతగా శుశ్రూషచేసినా క్షీణించుతున్నందున హాస్పిటలుకు చేర్చబడినాడు.

మణీంద్రుడు మొదట యెంత భగవద్భక్తిపరుడో తర్వాత అంత పక్కా నిరీశ్వరవాది యైనాడు. సమాజము లోని కుళ్ళును గ్రహించాడు. దేవునిచాటున దోపిడీ, అన్యా యము లెట్లు నిరాటంకముగా సాగింపబడుతున్నవో కళ్లార చూచి దేవునిపై విశ్వాసాన్నే వదలివేశాడు. హాస్పిటలులో తుదిఘడియలు లెక్కపెడుతున్న సమయములో మన్మదనాథ్, యశపాలులు వెళ్లారు. వారికి మణీంద్రుడు జీవించుతాడనే ఆశ సన్నగిలినది. మన్మథబాబు "దేవునిమీద నాకు నమ్మ కములేదు. అయినా అట్టి అప్రాకృతిక దైవశక్తి ఏదైనా వుంటే నేను హృదయపూర్వకముగా నీ ప్రాణాన్ని దక్కించ మని ప్రార్థిస్తున్నాను మణీ! నీవుకూడా ప్రార్థించు" మన్నాడు.

శ్వాసించుటకే విపరీతబాధ ననుభవిస్తున్న మణీం ద్రుడు వెంటనే 'డామ్‌గాడ్! నేను చావుకు జడుస్తున్నా నను కుంటున్నారా? నేను ప్రార్థించను. ఈజగత్తులో న్యాయమనే దెక్కడున్నది? దోపిడీ, అన్యాయము చేసేవాళ్ళే సర్వ

సౌఖ్యాలు అనుభవిస్తున్నారు. న్యాయంకోసము పోరాడేవాళ్లు అంతరించిపోతున్నారు. దేవుడుంటే ఈ అవకతవక లెందుకు జరుగుతాయి? ఒకవేళవున్నా అట్టి పక్షపాతపుబుద్ధిగలవాడిని నేనేల ప్రార్థించాలి?' అన్నాడు.

యశపాలు, మన్మథనాథ గుప్త జైలుడాక్టరును సహాయించి ఎన్నో చికిత్సలు చేయించారు; కాని, ప్రయోజనము లేకపోయినది. సహింపరాని వేదన ననుభవించుతున్నను- మృత్యుముఖము చూచి అతని హృదయము కించిత్తయినా చలించలేదు. ఏపరపాలన నెదిర్చి జైలుకెళ్ళాడో ఆ ప్రభుత్వపు అన్యాయాన్నెదిర్చి 1934 జూన్ 26 వ తేదీని వీరశయన మలంకరించాడు.

మణీంద్రునిగన్న మాత ధన్య! ఆ యమ్మ సంతానములో మరి ఆరుగురుకూడ పలుసార్లు సత్యాగ్రహోద్యమాలలో, విప్లవోద్యమములో పెల్గొని సంవత్సరాల తరబడి జైళ్ళలో కృశించారు. భూపేంద్ర బెనర్జీ జైలులో జబ్బుపడి విడుదల అయిన కొద్దిరోజుల్లోనే మరణించాడు. సునయినీదేవి కోడలు, అల్లుడుకూడ సత్యాగ్రహోద్యమాలలో జైలు చూచారు. ఆ మాతృదేవి వంగప్రజలు క్షోమంతో పీడింపబడుతూంటే పుత్రమరణశోకము కంటె అధికముగా దుఃఖించినది. నేటికీ ఆతల్లి ఆజ్ఞతో, మిగిలియున్న పుత్రులు మణీంద్రుని లక్ష్యసిద్ధికి-పీడిత మానవోద్ధరణకు పాటు పడుతూనేవున్నారు.

అజ్ఞాత వీరుడు మణీంద్రునికి, అతని జననికి ఆతని కుటుంబానికి దేశీయులు జోహారు లర్పించకుండా స్మరించ లేరు!

# మహావీర సింగ్

జిల్లా కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు వివిధశాఖల్లోని వుద్యోగులు ప్రభుత్వముమీద భక్తిని ప్రకటించటానికి తాలూకా పట్టణము కాస్‌గంజిలో సభ చేస్తున్నారు ధనవంతులు, భూస్వాములు, అమీరులు, వుమ్రావులు, సుఖాసీనులై వున్నారు. దారినిపోయే అమాయిక రైతు-కూలీలు ఏ పదిమందినో బలవంతముగా ఈడ్చుకువచ్చారు స్థానికాధికారులు సభ నిండుగా లేకపోతే తమ ప్రతిష్టకు భంగమని బడిపిల్లలను తీసుకురమ్మని పంతుళ్ళకు తాఖీదు లంపారు. బాల - బాలికలకు బిళ్ళలూ బిస్కత్తులూ పంచారు. సభా కార్యక్రమము ప్రారంభమైనది. జీహుకుందారులు వుపన్యసించుతున్నారు. బ్రిటిషు పాలనా ప్రశంస, రాజద్రోహి గాంధీజీ దూషణలే అసలా సమావేశ లక్ష్యము. అధికార దురహంకారులు, బిరుదాంకితులు, సత్యాగ్రహులపైన దుమ్మెత్తిపోస్తున్నారు. విద్యార్థులు భయంతో గప్‌చిప్‌గా వింటున్నారు; కాని, లోపల్లోపల అసహ్యించుకుంటున్నారు. అప్పుడకస్మాత్తుగా బాలురమధ్యనుండి 'మహాత్మా గాంధీ కీ జై' అన్న నినాదము వెలువడినది. వెంటనే బాలికలందరూ అందుకున్నారు. జయకారము మిన్నుముట్టినది. యెవరిని ప్రజల దృష్టిలో హీనపరచాలని సభ జరుపుతున్నారో ఆయన జయధ్వానమే ప్రతిధ్వనించినది. అది అధికారులకూ, సమావేశకర్తలకూ అంకుశముతో పొడిచినట్లయినది బహిరంగముగా తన్ను ముందు ప్రభుత్వద్రోహికి జై కొట్టిన దెవరు?

మెవరని ప్రశ్నించారు. అప్పుడు 12 లేక 13 సంవత్సరాల బాలుడు లేచి 'నేనే' నని జంకు గొంకు లేకుండా చెప్పాడు. మాష్టరు గుండెల్లో గుండెల్లేవు. అధికారులు బాలకుని చితుక బాదారు. అంతటితో ఆ సభ చెడిపోయినది. ఆ విద్యార్థి నాయకుడు – వీర బాలకుడు మహావీరసింగే.

సంయుక్తరాష్ట్రములో ఇటా జిల్లాలోని రాంపూరు అను గ్రామములో ఒక మధ్య తరగతి కుటుంబమందు మహావీర్ జన్మించాడు. జననీ జనకులు శారదాదేవి, దేవీసింగులు ధర్మ నిష్టాపరులు. 1921 సం॥లో గాంధీమహాత్ముడు స్వాతంత్ర్య శంఖమును పూరించగనే యీ దంపతులు ఆచార వ్యవహార ములు కట్టిపెట్టి కళ్ళె త్తి దేశమువైపు చూచారు. దేవీసింగు శరీరములో రాజపుత్ర రక్తము పొంగులువారినది. సత్యా గ్రహసమరరంగములోకి వురికాడు. శిక్ష – జైలు మామూ లేగా. జనకుని నిర్బంధము బాలమహావీరుని హృదయం మీద ఒకముద్ర వేసినది. జననివల్ల అన్ని విషయాలూ అడిగి తెలుసు కున్నాడు. పరాయి ప్రభుత్వము మీద అసహ్యము, స్వాతం త్ర్యేచ్ఛ కలిగాయి.

మహావీరుడు చిన్నతనములోనే అధికారులను, బడా సాహేబ్‌లను లెక్క చేయక సభాభంగము చేసి దెబ్బలు తిన్నా జంకలేదు. వీరునిలా, సంతోషపూర్వకముగా అనుభ వించాడు. ఆనాటి దెబ్బలతో అతని విద్రోహ భావము మరింత దృఢపడినది.

మహావీరసింగు స్కూలుఫైనల్ పూర్తిచేసి 1925 సం॥లో కాన్‌పూర్ డి. ఏ. వి. కాలేజిలో ప్రవేశించాడు,

ప్రథమ సత్యాగ్రహోద్యమాన్ని అణచివేశామని ప్రభుత్వము సంతృప్తి చెందినా విప్లవాగ్ని లోలోపల రాజుతూనేవుంది. వినాయకవర్గం సూటిగా దెబ్బకొట్టు మార్గం వదలి కౌన్సిళ్ళలో శాసనబద్ధమగు పోరాటాన్ని సాగించుతామని మెత్తని సోఫాలలో కునికిపాట్లుపడుతున్నారు. అందుచే దేశంలోని విప్లవశక్తులు నాయకత్వం లేకున్నను దేనిదారి నది చూచుకొనసాగాయి. కార్మిక – కర్షకుల సంఘటనకు కొందరు పూనుకున్నారు. మరికొందరు యువకులు బ్రిటిషు సామ్రాజ్య నిరంకుశత్వాన్ని హింసా కార్యక్రమముతో యెదిరించదలిచారు. భారత యువజను లీ రీతిని విప్లవోద్యమాన్ని సాగించుతూంటే సహజవీరుడు మహావీరసింగు స్వాతంత్ర్యోద్యమానికి దూరముగా ఎట్లుండగలడు? కాలేజిలో చేరినప్పటినుండి మిత్రులతో కలసి రాజకీయాలు తెలుసుకుంటూండేవాడు. డైరక్టుయాక్షనుతో ప్రజాసామాన్యములో చైతన్యము కల్గించాలని చర్చలలో వాదించేవాడు.

యు. పి. పంజాబు టెరరిస్టులు సమావేశమై హిందూస్థాన్ సోషలిష్టు రిపబ్లికన్ ఆర్మీని స్థాపించారు. ప్రస్తుత సమాజవ్యవస్థలోని కుళ్ళును బహిర్గతంచేసి భారతదేశములో సోషలిష్టు ప్రజాస్వామిక ప్రభుత్వ స్థాపనయే లక్ష్యముగా కలిగి వారు సాహసిక ప్రదర్శనా కార్యక్రమము (డిమాన్ స్ట్రేటివ్ యాక్షన్స్) ద్వారా విద్యావంతులగు మధ్యతరగతి యువకులను సంఘటితమొనర్ప పూనుకున్నారు. మహావీర సింగుకూడ ఆ సంఘములో చేరాడు, కాలేజి, ఇల్లు, వాకిలి, తల్లి, తండ్రి, బంధువులను వదలిపెట్టి ప్రొఫెషనల్ రివెల్యూ

పనరీగా తయారైనాడు. పార్టీ కార్యక్రమాన్ని సాగించ టానికి అవసరమైన మోటారు నడుపుట, రివాల్వరు కాల్చుట వగైరా నేర్చుకున్నాడు. ఎప్పుడెక్కడ అవసరమైతే అక్కడికే వెళ్ళి నిద్రాహారముల సౌఖ్యమెరుగక పనిచేయసాగాడు. ఎంతటి ప్రమాదకర కార్యమైనను భయభీతుల్లేకుండా పార్టీ ఆజ్ఞ మేరకు కొనసాగించుకొని వచ్చేవాడు. ప ాబు నేషనల్ బ్యాంకు దోపిడీలో మహాబీర్‌సింగు ప్రము ాత్ర వహించాడు.

1929 జూన్‌లో మహావీరుడు అరెస్టుచేయబడి లాహోరు కుట్రకేసులో ముద్దాయిగా చేర్చబడినాడు. ఆ రోజుల్లో కారావాసము-అందులోనూ విప్లవవాదుల విషయంలో యెలా వుంటుందో చెప్పనక్కరలేదు. ముద్దాయిలయినా పరస్పరము కలియరాదు. రాత్రింబగళ్ళు ఏక లాకప్పు. ఉత్తర ప్రత్యుత్త రాలు, ఇంటర్వ్యూలు, పుస్తకాలు, పత్రికలు అన్నీబంద్! కోర్టులోకూడ బేడీలు, పోలీసు జులుమూ. స్వాతంత్ర్య యోధు లివన్నీ సహింపలేకపోయారు. ముందుగా అసెంబ్లీ బాంబుకేసులో శిక్షింపబడిన భగత్సింగు, బటుకేశ్వరదత్తు జైలు అత్యాచారములను ప్రతిఘటింప నిరసనవ్రతమును సాగించారు. జూలైలో మహావీరసింగు తదితరులుకూడ ఆహారమును మానివేశారు. గణేశశంకర విద్యార్థి, జవహ ర్లాలు, సుభాసుబోస్ మొదలగు నాయకులు నిరసన వ్రతం పూనినవారి కెన్నివిధములనో చెప్పిచూచారు. కాని, లాహోరు కుట్రకేసు ముద్దాయీలు జయమో మరణమో అని పట్టువీడలేదు. ప్రభుత్వము దబాయించినది. బెదరించి

నది, కాని ఫలితము శూన్యమైనది. తుదకు దానవలీల ప్రారంభమైనది.

నిరాహారులై పడియున్న ఒక్కొక్కరిని పదేసిమంది మొద్దులాంటి వాళ్ళు పట్టుకోవడము, బలవంతముగా పళ్ళ సందు గుండాను, ముక్కుగోళ్ళలోనుంచీ రబ్బరు గొట్టా లెక్కించి పాలుపోయుటము, నిరసన ప్రతావలంబులు ప్రతిఘ టించటము, వారినోటినుండి – నాసికలనుండి రక్తము ప్రవ హించటము నిత్యకృత్యమైనది. బలవంతముగా పాలెక్కించ డంలో నిరాహారంచే బలహీనులైయున్న వారు మూర్ఛాగతు లవుతూండేవారు. మహావీరసింగు డాక్టర్లు నిర్బంధంగా ఎక్కించిన రబ్బరుగొట్టంలో నుండి కడుపులోని కొక్క చుక్కైనా పాలను జారనివ్వకుండా ప్రాణాయామముచేసి తిప్పలుపెట్టేవాడు. ఈ విధంగా యెన్ని హింసలైనా అనుభ వించారు. కాని తమ పట్టుదలను విడువలేదు. తుదకు అమర మూర్తి- ఆత్మత్యాగి జతీంద్రదాసును పొట్టను పెట్టుకున్న తర్వాతగాని ప్రభుత్వం లొంగిరాలేదు. రాజకీయ ఖైదీలకు ప్రత్యేక సౌకర్యాలు కల్గిస్తామని హామీయిచ్చిన తర్వాతనే మిగతావారంతా ఆహారమును గైకొనసాగేరు.ఇంతతోనైనా వారికి శాంతి లభించలేదు. తర్వాతకూడ అనేకపర్యాయాలు ఆ వీరులను జైలులో, నిందుకోర్టులో పట్టుకొని కొట్టారు. వైస్రాయి ప్రత్యేకంగా 'లాహోరు కుట్రకేసు ఆర్డినెన్సు'ను జారీచేశాడు. విచారణకు స్పెషల్ ట్రిబ్యునల్ నియామక మైనది. ట్రిబ్యునల్ ప్రధాన న్యాయమూర్తి శ్వేతజాతీయుడు ఇండియన్ జడ్జీతో చెప్పకుండానే ముద్దాయీలకుబలవంతంగా

నైనా బేడీలు వేయమని ఫర్మానా యిచ్చాడు. ఈ అవమానమును సహింపలేక లాహోరు వీరులు యెదిరించారు. పర్యవసానంగా వారిని చితుకబాదారు. గాయపడి నడువజాలని స్థితిలోనున్నవారు లారీలో జేరవేయబడ్డారు. ముద్దాయిలు విచారణలో పాల్గొన నిరాకరించారు. కోర్టుకు వెళ్ళటకుకూడ అయిష్టతను తెల్పి ఒకే లిఖిత వాఙ్మూలమును ఏకముగా యిచ్చారు. 16 మాసముల నాటకంతో విచారణ పూర్తి అయింది. అందరూ మహావీరునికి కూడ మరణశిక్షయే విధించుతారని తలచారు. మహావీరసింగు మాత్రం "నేను రాజపుత్రునివలెనే మరణిస్తాను" అంటూండేవాడు. 1930 అక్టోబరు యేడవతేదీని తీర్పు వెలువడింది. భగత్సింగు, రాజగురు, సుఖదేవులకు వురిశిక్షలు, మహావీరసింగుకు యావజ్జీవ కారావాస శిక్ష విధింపబడినది.

శిక్ష విధింపబడిన తర్వాత సింగు ముల్టాన్ సెంట్రల్ జైలులో మూడు మాసాలున్నాడు. 1931 జనవరిలో మహావీరసింగు మరి అయిదుగురు సహచరులతో మద్రాసు రాష్ట్రంలోనికి పంపబడ్డాడు. అతడు డాక్టరు గయాప్రసాదుతో బళ్లారి సెంట్రల్ జైలులో వుంచబడ్డాడు. ఇక్కడి భాష, కట్టు, ఆచారాలు, రీతి-రివాజులు, శీతోష్ణస్థితి అన్నీ వారికి కొత్తవైనవి. మనరాష్ట్ర ప్రభుత్వంకూడ వారిని హింసించుటలో ఏమీ లోటు చెయ్యలేదు. పెంపుడు పశువుల్లాగా వారు పడివుండాలని ప్రభుత్వోద్దేశ్యము. కాని వారు శిక్షాపాత్రులు అవటానికి ఏ అన్యాయాన్నెదిరించారో ఆ అక్రమాన్నే జైలులో మాత్రం వా రెట్లోర్వగలరు? జైలులో

వుండికూడ పోరాటం సాగించారు. 1932 సత్యాగ్రహోద్యమంలో పాల్గొని బళ్లారి కారాగారంలో నిర్బంధింపబడిన మన ఆంధ్ర సత్యాగ్రహులకు మహావీర గయాప్రసాదుల ధైర్యసాహసాలు, స్వాతంత్ర్య దీక్షలు పరిచితములే. ఆ వీర ద్వయము బళ్ళారిజైలు అధికారులకు, మద్రాసు ప్రభుత్వానికి శాశ్వతంగా జ్ఞాపకముండునట్లు పాఠం చెప్పారు. అధికారులు తమ గుప్పిట్లో వున్నారుగదా యని వారిని అవమానించబోయారు. వారు ఎదురుతిరిగి దెబ్బలాడారు. చేతికిచిక్కిన వార్డర్లను చావమోదారు. ఈ ఘటనతో జైలు అధికారులు సత్యాగ్రహుల దృష్టిలో చులకనైనారు. అధికారులీ తలవంపులతో వుద్రేకము పట్టలేక మహావీరునికి తిరుగబడిన నేరానికి కొరడాదెబ్బల శిక్ష విధించారు. మున్గా కారము గల చట్రానికి మహావీరుని అంటగట్టి అతని దుస్తులను చింపి లాగివేశారు. చుట్టూ సత్యాగ్రహ ఖైదీలను తీసికొనివచ్చి కూర్చో బెట్టారు. వారికి భీతికల్గించాలని అధికారుల తలంపు. తరువాత ఆ కిరాతులు సింగునగ్న శరీరంమీద పేముబెత్తంతో కొట్టూంటే పిఱ్ఱలపై చర్మం తోటలుగా వూడిపోతోంది. రక్తం ధారలుగా ప్రవహించసాగింది. కండలు బెత్తానికి అంటుకొని దూరంగా పోయి పడుతున్నవి. ప్రతిదెబ్బకు 'విప్లవం వర్ధిల్లాలి' అన్న సింహగర్జన రేగుతోంది. ఈ హింసా ప్రదర్శనంతో అధికారులు సత్యాగ్రహులను భయపెట్టదలచితే సింగు వారిలో విద్రోహభావాన్నే కల్గించినాడు. అతని ధైర్యసాహసాలు వారి హృదయాల్లో శాశ్వతంగా అంకితమైనాయి.

మద్రాసు జైళ్ళకు పంపబడిన బెంగాలు లాహోరు ఖైదు లతో కూడ ప్రభుత్వం విసిగి వేసారినది. వారిలో మరికొందరిని 1933 సం॥లో అండమాను ద్వీపానికి పంపివేసి తన పీక వదలించుకున్నది.

భారతావనికి ఎనిమిదివందలమైళ్ళ దూరాన బంగాళా ఖాతంలో పాటుమరించిన అబర్డీన్ ద్వీపంలో ఎత్తైన గోడల మధ్యవున్న జైలులో భారత విప్లవవాదుల సమాధులెన్నో కానా గలవు. అచటి శీతోష్ణస్థితి అనారోగ్యకరమగుటచే ఎందరో రెండరో ఖైదీలు ఆ ద్వీపానికి ఆహుతి అయ్యారు. 1921 సం॥ నుంచి Cardew committe రిపోర్టును బట్టి భారతీయ ఖైదీ లక్కడికి పంపబడుటలేదు. అయినా 1933 లో ప్రజలెంతో మొరపెట్టుకున్నా వినక మన విప్లవవీరుల నచటికి తరలించి వేసి. అక్కడ జైలులో దేశారాధకులను పశువులకంటె హీనంగాచూచారు. అండమాను జైలు ప్రత్యక్ష నరకకూపమే. ఆ జైలు అధికారులు యమకింకరులు. స్వచ్ఛమైన గాలికీ నీటికీ కూడ మొఖంవాచిపోయారు. కటిక నేలమీదనే శయనించవలసి వచ్చేది. పాములూ, తేళ్ళూ స్వేచ్ఛగా తిరుగుతూంటే ఆ యిరుకు గదుల్లో దీపాలకైనా ఏర్పాటు లేదు. పగలంతా నిర్బంధంగా కఠిన పరిశ్రమ చేయించేవాళ్లు. అన్నంలో రాళ్ళూ, పురుగులూ వుంటం జైలుకెళ్ళిన సత్యాగ్రహుల కాశ్చర్యం కల్గించదు. ముద్ద నోటిలోపెట్టుకోబోతే చెడుగాలువేసేవి. వుత్తరాలు బంద్. పుస్తకాలు, పత్రికల మీద నిషేధం, ప్రభుత్వానికి తెల్పుకున్నారు; కాని, ఫలితం శూన్యం. అప్పుడు వారి నక్కడపెట్టే బాధలు, హింసలు

వర్ణింప వలవికానివి. వారి అండమాను జీవితాలు విజయ కుమారసిన్హా, భయంకరాచారి గారలు తమగ్రంథముల ద్వారా ప్రపంచానికి వివరించారు. అక్కడి స్థితిగతులు విన్న వారిగుండె[illegible]జేస్తుంటే మరి స్వయంగా అనుభవించే వారికెట్లుండునో చెప్పనేల?

ఆ యమయాతనలనుండి విముక్తులు కావడానికి నిరాహారదీక్షయే శరణ్యమైనది. నిరసన వ్రతం ప్రారంభించారు. అధికారులు మూడురోజులవరకు వారిని గదుల్లో బంధించి నాలుగోనాడు మామూలు హింసాకాండ నారంభించారు. పఠాను మొద్దులతో ఒక్కొక్కరి కాళ్ళూ, చేతులూ, తలా, రొమ్మూ అదిమిపట్టించి రబ్బరుగొట్టాలతో పాలెక్కించారు. అయిదవరోజున ఆ దేశీలని ఆ రాక్షసులు మహావీర సింగును నేలమీద అణచిపెట్టారు. ముక్కురంధ్రంగుండా రబ్బరుగొట్టాన్ని శ్వాసకోశంలోకి దూర్చి పాలెక్కించారు. సింగు విదలించాడు. గిలగిల కొట్టుకున్నాడు కాని, ఆ క్రూరులు కదలనివ్వకుండ గట్టిగా అదిమి పట్టుకున్నారు. డాక్టరు గెరాటు (Funnel)ను పాలతో నింపి బలవంతంగా లోపలికి ఎక్కించాడు. వెంటనే సింగు హృదయకోశము పగిలిపోయినది. ఈవిధంగా అవమానపిశాచాలతో అంతిమశ్వాస పీల్చినంత వరకు యెదిరించి పోరాడి మహావీరసింగు సార్థకనామధేయుడై యమకింకరుల బారినుండి విముక్తుడైనాడు.

తమచేతులారా ఒక నిండుప్రాణాన్ని నిలువునా తీసినా అధికారులకు ఆవంతైనా చింతలేదు. మహావీరుని పవిత్ర దేహాన్ని స్ట్రెచర్ మీద వేసి రాత్రివేళ నిబిడాంధకారంలో

మోసుకొనిపోయారు. ఎదురుగా అబర్డీన్ సాగరము తరంగ ములతో కల్లోలము గావించుచున్నది. గాలి జుంయ్ జుంయ్ మంటూ వీచులోంది. నల్దిక్కులా నిశ్శబ్దం తాండవించు తోంచి. అప్పుడు మహావీరుని మృతకళేబర మా అనంత సాగరగర్భంలో కలిసిపోయింది.

# చంద్రశేఖర ఆజాద్

'నాపేరు ఆజాద్, అని బాల్యంలోనే చెప్పుకొని ఆ జన్మాంతము ఆజాద్‌గావుండి, ఆజాద్‌గానే అహుతియైన అమర వీరుని జీవితగాధ సంస్మరణీయము. విప్లవవాదుల కతనిపట్ల వల్లమాలిన భక్తి. సామ్రాజ్యవాదులకు సింహ స్వప్నము. భారత విరక్తిస్థు వుద్యమాదర్శము అతని నాయ కత్వములోనే మెరుగు వేలి వుద్యమము మెరపులాగా మెరసి, తుద కతనితోనే అంతరించినది. ఆ స్వాతంత్ర్యమూర్తి పవిత్ర నామమే చంద్రశేఖర్.

చంద్రశేఖర్ జన్మస్థానము ఉజ్జయిని ప్రాంతములోని ఒకపల్లె. తండ్రి వైజనాధుడు శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణుడు. ఆయన అందరివలె ఇంగ్లీషు నెగబడక కొడుక్కి సంస్కృత ముని చెప్పించ దలచాడు. సకుటుంబముగా కాశీ క్షేత్రా నికి పోయి మకాము పెట్టాడు. చంద్రశేఖర్ హిందీతోపాటు బాల్యములోనే దేవభాషను చదువసాగాడు.

1921 సం॥లో మహాత్ముడు సహాయ నిరాకరణ శం ఖాన్ని పూరించుటతో అన్నిమూలలా ప్రజాసామాన్యములో

చైతన్యము కలిగినది. వేలాది విద్యార్థులు కాలేజీలను స్కూళ్లను బహిష్కరించారు. సంస్కృత విద్యార్థులుకూడ ఆ మహా సంరంభంలో కదలకుండా వుండలేకపోయారు. రమకు తోచినట్లు వుద్యమంలో పాల్గొన్నారు. అట్టివారిలో చంద్రశేఖర్ ఒకడు. అప్పుడతడు పక్కా అహింసావాది. దీక్షవహించిన బాల స్వయంసేవకుడు. తిన్నగా పద్నాలుగేండ్లు నిండని ఆ చిరుతప్రాయములోనే అతడు స్వాతంత్ర్యోద్యమములో అడుగు పెట్టాడు. అప్పు డతను చూపిన ధైర్య మసమానము. పట్టుదల మెచ్చదగినది. కాశీలోని ప్రతి పాఠశాలకు పోయి ప్రబోధంచేశాడు ఆరోజుల్లో ఆందోళన చేయుట సామాన్యముకాదు. ప్రభుత్వానికి వ్యతిరేకముగా నాలుగు కేకలు వేస్తే చాలు. చిన్న, పెద్ద వివక్షత లేకుండా శిక్షకు గురికావలసిన దే. చంద్రశేఖర్ కూడ అరెస్టు చెయ్యబడ్డాడు. కోర్టులో విచారణకు నిలబెట్టబడినప్పుడు 'నీ పేరేమి' టన్నప్రశ్నకు ముక్కుపచ్చలారని చంద్రశేఖర్ యిచ్చిన జవాబు అతనెట్టి ధీశాలియో, స్వేచ్ఛాప్రియుడో తేటపరుస్తుంది. 'నాపేరు అజాద్' అన్న ఆ ప్రత్యుత్తరము ప్రేక్షకులనేగాక అధికారులను సైతము చకితులను గావించినది.

తతిమ్మా విద్యార్థులకు కారావాసశిక్ష విధించి చంద్రశేఖర్‌కు మాత్రం 15 కొరడా దెబ్బల శిక్షవిధించారు. అదే అతని ధైర్యానికి ముట్టిన బహుమతి. సెంట్రల్ జైలుకు తీసికెళ్ళారు. పసిబాలుడా కఠిన ప్రహారముల కెట్లోర్వగలడా యని గేటువద్ద మూగిన ప్రజలు విచారపడుచున్నారు. చంద్రశేఖర్ తొణుకూ బెణుకూ లేకుండానే పోయి దెబ్బలకు

సిద్ధమయ్యాడు. వార్డర్లు త్రికోణ చక్రానికి త్రాటితో కట్ట బోతూంటే "కట్టడమెందుకు! నిలబడే వుంటాను. కొట్టుకోం" డన్నాడు.

ఒక్కొక్క దెబ్బతగుల్తూంటే 'వందేమాతరం' 'గాంధీజీకీజై' అన్ననినాదాలతో చంద్రశేఖర్ జవాబిచ్చాడు. ఆ కిరాతకులు పసివాడని జాలిచూపలా. పూర్తిగా పదిహేను దెబ్బలూ కొట్టారు. చర్మము తోటలు లేచినది. రక్తము కాల్వకట్టింది. మరి బాలు డాబాధ కోర్వలేకపోయాడు. స్పృహతప్పి నేలకొరిగాడు. కాస్సేపటికి తేరుకొని చంద్రశేఖర్ కాలినడకనే బయటికి వచ్చాడు.

చంద్రశేఖర్‌ని దెబ్బలుకొట్టినవార్త నగరమంతా వ్యాపించినది. ప్రజ లతన్ని చూడటానికి గుంపులుగా వచ్చారు. చంద్రశేఖర్ మొహంలో భయచిహ్నలుగాని, విచారరేఖలుగాని లేవు. అయితే ఆనాటిదెబ్బలు అతని హృదయంలో బాగానాటుకున్నై. నాటినుంచే అతడు విద్రోహి అయ్యాడు. ఆ అమానుష శిక్షకు ప్రతీకారవాంఛ చంద్రశేఖర్ హృదంతరాళంలో స్థిరావాస మేర్పరచుకున్నది. ఆ దెబ్బల మచ్చ లతని దేహంమీదనేకాక హృదయమందుకూడ శాశ్వత చిహ్నలుగా ఏర్పడినాయి. ఆ పసిబాలుడన్ని దెబ్బలు తిన్నా వుత్సాహంగా వుండటం చూచినవారూ, విన్నవారూ చకితులయ్యారు. ఆనాడు కోర్టులో 'నాపేరు ఆజాద్' అని చెప్పిన చంద్రశేఖర్ ఆనాటినుండి ఆపేరనే పిలువబడసాగాడు.

కాశీలో ఆజాద్ పేరు మారుమ్రోగింది. పురవాసులు గొప్పసభజరిపి ఆ బాలుని సన్మానించారు. పూలమాలలతో

అతన్ని ముంచెత్తారు. వేదికపై కెక్కి చంద్రశేఖర్ మాట్లాడుతూంటే ప్రేక్షకులు విరగ ద్రొక్కుతున్నారు. మరునాటి పత్రికలన్నీ ఆవీర బాలుని చిత్రాలనుప్రకటించాయి. అతని ధైర్య-సాహసాలు వేనోళ్ళ ప్రశంసించబడినై.

సహాయ నిరాకరణోద్యమము వుపసంహరింపబడినది. కాంగ్రెసు నాయకులు పోరాట మార్గాన్ని విడిచిపెట్టడము యువకులకు రుచించలా. ఆజాద్‌కు నిరాశ, నిరుత్సాహాలు కలిగాయి. సత్యాగ్రహపోరాటంలో విశ్వాసము సడలిపోయినది. అహింసాపథాన్ని వదలి నూతన మార్గాన్ని వెతుక్కో-సాగాడు.

చంద్రశేఖర్ మళ్ళీ కాశీవిద్యాపీఠములో చేరి చదువ సాగాడు. అంతవరకు అతను సంస్కృతము చదువుటలో గడిపి యుండుటచే క్రిందితరగతిలో చేర్చుకోబడ్డాడు. అతని ప్రవేశముతో విద్యాపీఠం విద్యార్థుల్లో సంచలనము కలిగినది. సత్యాగ్రహోద్యమములో పాల్గొన్న ఆజాద్ పేరు వినని వాడు లేడు. ఆ బాలవీరుడే తమమధ్యకు వచ్చినందుకు కొందరు ఆనందించారు. ఎద్దులాగుండి క్రిందితరగతిలో చదువుతున్నాడని మరికొందరు నవ్వుతున్నారు. ఆజాదు ఎన్నాళ్ళో చదువు సాగించలేకపోయాడు. అతనిధ్యాస పుస్తకాలమీద నిలవలా. ఎందుకొచ్చినపీడయని అసలే మానివేశాడు. అతని దృష్టి స్వాతంత్ర్యసంపాదనకు మార్గాన్ని అన్వేషించ సాగినది.

ఆరోజుల్లో వ్యక్తిగత హింసావాదము మళ్ళీ తల చూపినది. అన్నిప్రాంతాల్లోను రహస్యవిప్లవ సంఘాలు స్థాపన అయినై. మొదటినుంచి కాశీ విప్లవోద్యమానికి కేంద్రము

గానే వున్నది. అది మిగతాప్రాంతముల కెన్నడు తీసిపోలేదు. బలమైనదళ మేర్పడినది. విప్లవదళాన్ని నడుపుతూన్న శచీంద్రబక్షీ, రాజేంద్రనాధ లహరీలతో చంద్రశేఖరునికి పరిచయమైనది. అహింసావాదముతో అసంతృప్తి చెంది యున్న ఆజాదును వారి హింసాత్మకభావాలు ఆకర్షించినై. చదువుకు సున్నాచుట్టినా, రాజకీయాలు తెలుసుకునేవాడు. తరచుగా విప్లవవాదులను కలుసుకుంటూండేవాడు. ప్రణవేశ చటర్జీ అను ఒకాయన ప్రోత్సాహముతో 'హిందూస్థాన్ ప్రజాస్వామ్య సంఘ' సభ్యుడుగా చేరాడు.

ఆజాద్ ప్రతి సాహసకార్యంలోనూ ముందుండేవాడు. సమర వ్యవహారాల్లో అతిపుత్సాహముతో పాల్గొనేవాడు. భయమన్నమాట అతని నిఘంటువులోనే లేదు. పార్టీకి నూతన సభ్యులను చేర్చుట, ఇతర గ్రామాలకు, పట్టణాలకు పోయి పార్టీదళములను స్థాపించుటకుకూడ తీవ్రముగా కృషి చేస్తుండేవాడు.

ఆజాద్ ఏమంత విద్యావంతుడు కాడని ఇదివరకే తెలిపాను. అందుకు తగినట్లు పుస్తకాలుకూడ చదివేవాడుకాడు. పార్టీనాయకులు విప్లవసాహిత్యమిస్తే తెరచి చూడకుండానే వాపసు చేసేవాడు. అయితే ఏదైనా చదివితే మాత్రం అందలి ప్రతి చిన్నవిషయాన్ని హృదయస్థం గావించుకొనే వాడు. నిత్యమూ పత్రిక మాత్రము తప్పనిసరిగా చదివే వాడు. ఆజాద్ థీరిటికల్‌గా చదువకున్నను అతనిముందు నోరెత్తుట కెవరికీ సాహసముండేదికాదు. పార్టీతలపెట్టిన

ఏకార్యాన్నైనా నిర్విఘ్నముగా కొనసాగించగల దిట్టయని అందరికీ నమ్మకమే.

1925 ఆగష్టు 9 వ తేదీన కాకోరీవద్ద రైలులో దోపిడీచేసినవారిలో అజాద్‌కూడ వున్నాడు. కాకోరీ కుట్ర కేసులో అతడుకూడ ముఖ్యుడుగా ఎంచబడ్డాడు. అయితే అసలతడు పట్టుబడనేలేదు. సి. ఐ. డీ. లు కాశీపట్టణమంతా గాలించారు. కాని వారికి అతని పత్తాదిక్కు లేదు. యు. పి. రాష్ట్రప్రభుత్వం అజాద్‌ను పట్టియిచ్చువారికి 2 వేల రూపాయల బహుమతిని ప్రకటించింది. అందుకూ ఫలితం లేక పోయింది. 'నా బొందిలో ప్రాణంవుండగా నేను పట్టుబడను' అని అజాద్ అంటూండేవాడు. ఈ ప్రతిజ్ఞను కడవరకు చెల్లించుకున్నాడు.

కాశీనుంచి పరారై అజాద్ ఝాన్సీ పరిసరారణ్యంలో సంచరించసాగేడు. తర్వాత కొన్నాళ్ళ కా వైనం గూఢచార్లు పసికట్టారు. అయితే పోలీసు సిబ్బంది ఆ అరణ్యాన్ని చుట్టు ముట్టకముందే అతడు ఝాన్సీపట్టణంలోకి చేరుకున్నాడు. అచటి స్థానిక పార్టీని దృఢతరము గావించుటకు కృషిచేయ సాగాడు. ఆ దేసమయంలో మోటారునడుపుట, రివాల్వరు షూటింగు నేర్చుకున్నాడు. ఈ రెండుపనులు అనంతర జీవితంలో అతనికి బాగా వుపకరించాయి.

తాను పట్టుబడకుండా తప్పించుకున్నా, కాకోరీకేసు సందర్భములో చాలమంది పట్టుబడి జైలులో కృశించటం అజాద్ సహించలేకపోయాడు. సహచరులను తప్పించాలని

ప్లానులు వేశాడు. కాని ఫలించలేదు. కాకోరీ పురికుట్ర లో పార్టీ సభ్యులలో కొందరు జైలుపాలయారు. నాయకులు కొందరికి శిక్షపడి కొందరికి పరారీ అయ్యారు. ఆ స్థితిలో ఆజాదుకు యు. పి. లో అజ్ఞాతవాసం కూడ కష్టమైంది. ఆజాద్ పని చేయుటకు బొంబాయి వెళ్ళాడు. అక్కడ అసలు పలుకరించే దిక్కైనా లేకపోయింది. భుక్తి గడవడమే కష్టమైంది. అప్పుడు దృఢశరీరమే ఆధారా మైంది. ఓడల రేవులో సామానులు మోస్తూ ఆ కూలీతో పొట్టనింపుకుంటూ రోజులు గడుపసాగాడు. పగలంతా చెమట ఓడ్చి పనిచేస్తే తొమ్మిదణాలు చేతికి వచ్చేవి. అయిదు అణాలతో రొట్టె, పాలు కొనుక్కొని, తక్కిన నాల్గణాలు వెచ్చించి నిత్యమూ సినిమా చూస్తుండేవాడు. సినిమా వద లిన తర్వాత రాత్రి ఒంటిగంటకు ఓడరేవుకుపోయి ఎక్కడో కాస్సేపు కళ్ళుమూసేవాడు. విప్లవనాయకులపేర్లు చెప్పి చందాలు వసూలుచేసి, స్వార్థపరులు భోగవిలాసా లనుభ వించుతూన్న రోజుల్లోనే చంద్రశేఖర్ కూటికి గతిలేక దరిద్ర మనుభవించాడు.

ఆజాదు కష్టకాలాన్ని గడుపుటకు కూలీగా కఠినపరి శ్రమచేస్తున్నా మళ్లీ పార్టీని కూడదీసి పనిచేసే దెట్లా అని అదనుకోసం ఎదురు చూస్తూనే వున్నాడు. బొంబాయివంటి పట్టణంలో కూలీలలో ఒకడుగా పనిచేస్తూ పీడిత ప్రజల దుస్థితిని ప్రత్యక్షంలో అనుభవం చేసుకున్నాడు. అతని విప్ల వాత్మ మరింత మేలుకొన్నది.

కొన్నిరోజులు గడచిపోయాయి. ప్రజలు కాకోరీకుట్ర కేసును మరచిపోజొచ్చారు. అధికారుల హడావుడి, గూఢచారుల హంగామా కొంతవరకు తగ్గిపోయింది అజాదు మరి బొంబాయిలో వుండలేకపోయాడు. తాను కార్యరంగంలోనికి వురకటానికి అదే తరుణమని యు. పి. కి వచ్చివేశాడు. అప్పటికి పదహేకాంశులైన పిరికిపందలు పార్టీకి నాయకులయ్యారు. వారిలో ప్రతీకారవాంఛ మచ్చుకైనా లేకపోయింది. పార్టీ దుస్థితికి అజాదుహృదయం క్షోభించిపోయింది. పార్టీని పునరుద్ధరించుటకు ఆలోచింమతూ పలు ప్రాంతములు పర్యటన చేశాడు. భగత్సింగుకూడ అదే ప్రయత్నంలో వున్నాడు. ఇద్దరూ కలసి వివిధ రాష్ట్రములలోని టెర్రరిస్టులతో సమాలోచనలు జరిపారు. 1928 సం॥ జూలై 8వ తేదీని పంజాబు, యు. పి, బీహారు ప్రాంతాల్లోని ముఖ్యులెల్లరు సమావేశమై దీర్ఘంగా చర్చించి అఖిల భారతావనికి ఒకే విప్లవపార్టీని 'హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ' అను పేరుతో స్థాపించారు. కొందరిని రాష్ట్రసంఘముల అగ్రనాయకులుగా నియమించారు. కేంద్రసంఘానికి అజాదునే అధ్యక్షుడుగా యెన్నుకున్నారు. పార్టీ సైన్యాన్ని నడపదగిన సమర్థుడు ఒక్క అజాదే. పార్టీసభ్యులందరూ అతని నాయకత్వాన్నే ఏకగ్రీవంగా ఆమోదించారు. నాటినుండి హిం. సో. రి. ఆర్మీకి అజాద్ సర్వసేనాపతి. అతని ఆధిపత్యంలో అనేక బాంబు ఫ్యాక్టరీలు స్థాపింపబడినాయి. భగవత్సింగు భగతీచరణు లిద్దరు అతని కుడి, ఎడమ భుజాలుగా పని చేశారు. అసెంబ్లీలో బాంబు, వైస్రాయిరైలుబండిక్రింద బాంబు, సాండర్సు హత్య,

రాజకీయదోపిడీలు, ఇట్లినో విప్లవసంఘటనలు అజాదు నిరీక్షణ క్రిందనే జరుపబడినై.

ఆజాద్ మొదట్లో మహా ష్టపరుడు. పార్టీలో చేరిన తర్వాతకూడ స్నాన- సంధ్యావందనా ద్యనుష్టానములలో ఏమాత్రం ఏమరిపుండేవాడుకాదు. భోజనాత్పూర్వం ఈశ్వరోపాసన తప్పకుండ నిర్వర్తించేవాడు. దేవాలయానికి పోవుటకు వీలులేక ఒక మట్టి విగ్రహాన్ని ముందుంచుకొని తదేక ధ్యానంతో పూజించేవాడు. మతపిచ్చికూడ వుండేది. ఎప్పుడైనా అన్యమతావలంబుల యింట భుజించవలసివస్తే మానసికంగా యెంతో బాధపడేవాడు. తిన్న తర్వాత తప్పకుండ ప్రాయశ్చిత్తం చేసుకునేవాడు. భగత్సింగు, భగవతీచరణుల సాహచర్యంతో అతడు సనాతనాచారములకు తిలాంజలి నిచ్చివేశాడు. తాను నమ్మిన విషయాన్ని ఆచరించడానికి అమలులో పెట్టడానికి ఎంతమాత్రం సంకోచించేవాడుకాదు. మొదట్లో అతడు జందెమును కల్గియున్నాడు. కాని నిరీశ్వరవాదంపైన విశ్వాసం కుదిరిననాడే దాన్ని తెంచి పారవేశాడు.

చంద్రశేఖర్ నైతిక ప్రవర్తన, క్రమశిక్షణల విషయంలో చాలశ్రద్ధ చూపేవాడు. ఆన సైనికుల నెంత కట్టుదిట్టంగా వుంచినా వారిపట్ల అత్యంతప్రేమ-వాత్సల్యాలు కలిగివుండేవాడు. ఎవరికెట్టి కష్టం వచ్చినా తనదిగా భావించేవాడు. సేనాపతిగానై ఎక్కడో కూర్చుని హుకుం జారీచేయక ప్రతిసందర్భంలోను సామాన్య సిపాయివలె ముందుండి నడిపేవాడు.

ఆజాద్ నిగర్వియేగాక నిరాడంబరుడు. తిండి-బట్టల విషయంలోకూడ చాలపొదుపుగా వాడేవాడు. పంచెలు బలవంతంమీదనే ఎప్పుడైనా చినిగిపోయిన పాతవస్త్రాలను వదిలేవాడు. మాసి పీలికలైన గుడ్డలే అతణ్ణి శత్రువులు గుర్తించకుండా విపత్సమయాల్లో కాపాడటం జరిగింది. ఫరారు దశలో ఒకప్పుడు ఒకమిత్రుని యింట్లో వుంటు న్నాడు. నాడు హోలీపండుగ. వుత్తర దేశాచారం ప్రకా రం స్త్రీలు తోడబుట్టినవారికి ఆ పండుగనాడు కంకణం కట్టాలి. ఆ యింటి గృహిణి రాత్రి పిండివంటలు తయారు చేసుకుని సమీప గ్రామంలోని పుట్టింటికి వెళ్ళటకు సిద్ధమై మూట నట్టింట పెట్టుకొని కూలివానికొరకు ఎదురు చూస్తు న్నది. ఆజాద్ కూడ అక్కడే నిలబడి ఆమెతో మాట్లాడు తున్నాడు. ఆ యింటియజమాని-ఆజాదు మిత్రుడు కాంగ్రెసు వాది. ఇన్స్పెక్టరు ఆయనతో అపుడపుడు వచ్చి మాట్లాడి పోతూండటం మామూలే. గృహిణికూడ అతనితో చనువుగా మాట్లాడుతూండేది. ఆమె పోలీసు అధికారి రావడం చూచి ఆజాదు నెక్కడ గుర్తించుతాడో అని భయపడింది. అయితే తన కంగారును పైకి కన్పించనీయకనే చక్కని యుక్తిపన్ని నది. వస్తూన్న ఇన్స్పెక్టరుకు విన్పించునట్లుగాను అతన్ని చూడనట్లూ, ఆజాదు వైపుకు తిరిగి "ఒరే రామూ! పొద్దెక్కుతోంది, త్వరగా మూట తీసికొని నడువు" మని నౌకరు నాజ్ఞాపించినట్లు అన్నది. ఆజాదుకూడ ఎబ్బెరికం లేకుండా నౌకరువలెనే 'చిత్త' మంటూ మూట నెత్తికెత్తు కున్నాడు. గుడ్డలుమాసి కూలివానివలెనే వుండుటచే ఇన్స్పె

క్టరుకు అనుమానమైనా కలగలేదు. అప్పుడు ఆజాదువంటి పైన చొక్కాయికూడ లేకుండెను.

ఆ యిల్లాలు బయటికి బయలుదేరినట్లే ద్వారంవైపుకు రెండడుగులువేసి ఇన్స్పెక్టరును అప్పుడే చూచినదానివలె "ఓహో! మీరా! రండి. మంచిసమయానికే వచ్చారు. ఇవ్వాళ హోలీకదూ! సోదరులకు కంకణంకట్టి వద్దామని పుట్టింటికి బయలుదేరాను. మీరు నాకు సోదరసమానులే. మీకు రక్షాబంధనము కట్టే వెళతాను. రండి" అని స్వాగతం చెప్పి ఆజాదుతో "ఒరేయి! కొంచము మూట దించు" అని అందులోనించి ఒకకంకణంతీసి అధికారిచేతికి కట్టి ఫలహారం కూడ పెట్టింది. ఆమె ప్రయాణమైవున్నందునా, యింటి యజమాని లేనందునా, అతడు త్వరత్వరగా మిఠాయితిని సెలవుపుచ్చుకొని వెళ్ళిపోయాడు. ఆనాడు ఆ గృహిణి సమ యోచిత తెలివితేటలూ, జీర్ణవస్త్రములే ఆజాదుకు ప్రమాద మును తప్పించాయి.

పార్టీకి ఎన్నితిప్పలుపడి అయినా సైకం సంపాదించే వాడు. పార్టీనిధిలో ప్రతిపైసను జాగ్రత్తగా వాడాలనేవాడు. ఒకపర్యాయం కలకత్తాలో పార్టీపనిమీద వుంటున్న బటు కేశ్వరదత్తు, కాన్పూర్‌లోవున్న కేంద్రనాయకులతో ఏదో ఆలోచించుటకు వచ్చాడు. అప్పట్లో ధనాభావంచే చాల యిబ్బందిపడుతూ పార్టీనాయకులు పూటకు ఒక్కొక్కరు సగం రొట్టెమాత్రం తిని గడుపుతున్నారు. ఆనాడు రొట్టెలు తెచ్చే సభ్యుడు దత్తు నిమిత్తం పూర్తి రొట్టెను తేగా అతణ్ణి పదిమందిలోనూ 0-1-6 అదనంగా ఖర్చుపెట్టినందుకు నానా

చీనాట్లూ పెట్టాడు. ఆ అరరొట్టెతో ఒకరు మరొకపూట గడపవచ్చునని అతని తలంపు.

ఆజాదు విద్యార్థిదశలోనే పార్టీపనిలో మునిగిపోయి ఇంటిముఖం చూచుటే మానివేశాడు. తల్లి-దండ్రులు పుత్రుని వార్తలైనా తెలియక కాశీ వదలి తమస్వగ్రామానికి వెళ్ళిపోయారు. ఒకప్పుడు వారు ఉదరపోషణకూడ జరుగక దారిద్ర్యంతో అవస్థపడుతున్నట్లు తెలిసింది. అప్పుడు దోపిళ్ళ ద్వారా చేర్చిన పార్టీ నిధి ఎక్కువగానేవుంది. అయినా ఆజాదుకు జననీ జనకులకు సహాయంచెయ్యాలనే తలంపేలేదు. ఆ విషయం ఎరిగివున్న సహచరులు రెండువేలరూపాయలు దోపిడీచేసి తెచ్చి ఇంటివద్ద యిచ్చిరమ్మని ఆజాదు కివ్వగా పార్టీకోశంలోవేసి "ముసలిపీనుగులకు రెండు వే లెందుకు? రెండు గుళ్ళు చాలవూ? అందరికీ సంసారాలున్నాయి. అంటరం యిలాగే పార్టీనిధితో కుటుంబాలను పోషించుకుంటూంటే పార్టీపని ఏమవుతుంది? మనము దోపిళ్ళుచేసేది మన కుటుంబాల కొరకా, పార్టీనిమిత్తమా?" అని వారిని కసరి కొట్టాడు. ఇంతకంటె అతని నిస్వార్థ సేవాదీక్షను తెల్పుట కింకేమి కావాలి?

ఆజాద్ మొదట్లో అహింసావాది. తర్వాత టెర్రరిష్టు. అనంతరం సోషలిష్టుగా మారాడు. అతడు సోషలిస్టు అయినా డనుటకు అతని ఆధ్వర్యంక్రింద పార్టీ ప్రకటించిన ఆదర్శ-లక్ష్యములే చాలు. భారతదేశములో బ్రిటిషు ప్రభుత్వానికి స్వస్తిచెప్పి కార్మిక నియంతృత్వాన్ని స్థాపించుటే వారి ప్రధానోద్దేశము. అయితే కర్షక, కార్మికులను సంఘటితపర్చే

ముందు వేలకొలదిగా యువకులను సమీకరించి సాయుధ చర్యలను సాగించుతూ ప్రజాసామాన్యము కళ్ళు తెరపించాలనే పాత మార్గాన్ని అనుసరించారు. మరికొంత కాలం గడచిన తరువాత ఆజాదు ఈ వుద్దేశ్యాన్ని కూడ మార్చుకొని పీడితప్రజలలోనే పనిచేయాలని విశ్వసించాడు. కాని అట్టి అవకాశం లేకపోయింది.

పంజాబు కేసరిని లాఠీ ప్రహారములతో చంపిన అధికారుల హింసావిధానమునకు ప్రతిహింసతోనే జవాబు చెప్ప దలచినది పార్టీ. సాండర్సును హత్యచేసినతర్వాత భగత్సింగు వగైరాలకు కాపుండి సురక్షితంగా ఆజాదే తరలించుకు పోయాడు. అప్పటినుండి పంజాబు ప్రభుత్వం కూడ ఆజాదును వెన్నాడినది. కాని అజాదు అతి చాకచక్యంగా బైరాగి వేషంతో పోలీసుల కళ్ళల్లో దుమ్ముకొట్టి తప్పించుకు పోయాడు.

తర్వాత ఢిల్లీవద్ద వైస్రాయి యిర్విన్ స్పెషల్ రైలును బోల్తా కొట్టించడానికి ప్రయత్నంచేశారు. ఎక్కడే సంఘటన జరిగినా ఆజాదు నాయకత్వంక్రిందనే యని ప్రభుత్వం కూడ నమ్మింది. ప్రభుత్వ మతనిపై కసిబూని ఎలాగైనా పట్టుకొనితీరాలని పట్టుబట్టింది. ఆజాదు చిత్ర పటాలు ప్రతి స్టేషనులోను వేళ్ళాడగట్టారు. అతనిని పట్టి యిచ్చేవారికి పదివేల రూపాయలు బహుమతి యివ్వబడునని ప్రకటింపబడినది. గూఢచారు లెంత ప్రయత్నించినా ఆ వీరసింహం బోనులో పడనేలేదు. అతడు ఆజాద్! ఆజాదుగానే వుండిపోయాడు.

లాహోర్ కుట్రకేసులో ముఖ్యు లనేకమంది శిక్షింప బడినారు. భగత్సింగు ప్రభృతులు బలియైపోయారు. మిగిలిన వారు జైళ్ళలో మగ్గిపోతున్నారు. భగవతీచరణ్ రావీనదీ తీరాన అసువులు గోల్పోయాడు. దేశంలోని పత్రికలన్నీ టెర్రరిస్టులపైన దుమ్మెత్తిపోస్తున్నవి. నాయకులు నిరసించు తున్నారు. అట్టిస్థితిలో ఆజాదుకు అన్ని తావులనుండి పార్టీ దళాలు విచ్ఛిన్నమైన వార్తలే చేరుతున్నాయి. ఎటు చూచినా విపత్ సూచనలే.

ఆజాదు సహచరులను కోల్పోయిన దుఃఖాన్ని దిగ మ్రింగి ధైర్యం చిక్కబట్టి ఒకపరి వివిధ ప్రాంతములు తిరిగాడు. యువజన సముదాయములో తా మంతవరకూ ఆశించుతూవచ్చిన వుత్సాహం కన్పించలేదు. ప్రజలలో చైతన్యం వచ్చినదికాని, వారిచూపు హింసావాదం వైపు లేదు. ఆజాదు పరిస్థితులను గ్రహించాడు. భారతదేశంలో టెర్రరిజానికి మరి తావు లేదనుకున్నాడు. ప్రజాసంఘటనయే భావి కర్తవ్యమని తలచాడు. అయితే పగబట్టిన త్రాచువలె గూఢచారులు తన్ను వెన్నాడుతున్నారు. టెర్రరిజంపైన విశ్వాసం పోయినా తాను బయటపడి ప్రజల్లో పనిచేదామంటే వురితాడు ఎదురుచూస్తోంది. మెదలకుండా ఏ మూలనో కాలము వెళ్ళబుచ్చాలనే స్వభావము కానేకాదు. ఆజాదుకు దేశంకోసం ఏదైనా చేయాలనే తీవ్రవాంఛమాత్రం వుంది. అత డీ సమస్యనే నాయకులముందు పెట్టాడు. ఆ స్థితిలో తా నేమి చేయువలెనో చెప్పమన్నాడు వారిని. కాని ఒక్కరూ ఇదమిత్థమని తేల్చి చెప్పలేకపోయారు.

తుదకు ఆ సమస్యను తానే స్వయముగా విడదీసుకున్నాడు. టెర్రరిస్టు పార్టీని రద్దుచేసివేశాడు. తన సహచరులెల్లరికి ప్రజలమధ్యకు పోయి పనిచేయుడని చెప్పాడు. తాను ఇక్కడ వుంటే పట్టుబడుట తప్పదు. అందుచేత యశపాలుతో హిందూదేశాన్ని వదలిపెట్టి రష్యాకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. విదేశంలో భారత విప్లవోద్యమాన్ని గూర్చి ప్రచారం చేయదలచాడు.

విదేశానికి ప్రయాణంనిమిత్తం సన్నాహమంతా పూర్తి అయింది. పైకము మాత్రమే చేతిలోకి రావలసి వున్నది. అలహాబాద్‌లో ఒకనివద్ద కొన్నివేల రూపాయలు పార్టీనిధి వున్నది. ఆజాదు ఆ పైకం కొరకు అలహాబాదు వెళ్ళాడు. ఆ వ్యక్తి రేపు రేపని వాయిదాలువేస్తున్నాడు. అందుచే ఆజాదు పైకము కోసము అక్కడే కాచుకొని వుండవలసి వచ్చినది.

1931 ఫిబ్రవరి 27వ తేదీ ప్రొద్దుటూన ఆజాదు ఒక సహచరునితో అలహాబాదులోని అల్ఫ్రెడ్ పార్కులో కూర్చుని మాట్లాడుతున్నాడు. పైక మివ్వవలసిన వ్యక్తి ఆ పూట తప్పక అక్కడికి తెచ్చి యిచ్చెదనని వాగ్దానము చేశాడు. ఆజాదు అతని కోసము నిరీక్షిస్తున్నాడు. అంతలో ఆకస్మికముగా ఒక మోటారుకారు వచ్చి ఆగినది. వెంటనే అందులోనుండి ఓ. డి. ఎస్. పి. దిగి రివాల్వరును గురిపెట్టి 'హ్యాండ్సు అప్' అన్నాడు

ఆజాదు అట్టి పరిస్థితికి సర్వదా సంసిద్ధుడై వుంటాడు. అతడా యాకస్మిక ఆక్రమణతో సమాత్రం తొట్రుపడలా.

లక్షణమే తూటాలతో నింపియున్న పిస్తోలు తీశాను. ఇరుపక్షాలనుంచి కాల్పు లారంభమైనవి ఆజాదు తొడలో ఒక గుండు తగిలింది డి. ఎస్. పి. చేతికి కూడ ఒక దెబ్బ తగిలి అతని రివాల్వరు క్రింద పడిపోయినది ఆయుధం జారిపోగానే సూపరింటెండెంటు ఒక చెట్టుచాటుకు పోయి నిల్చున్నాడు. దెబ్బతిని కూడ ఆజాదు విడువకుండా ఫైర్ చేస్తున్నాడు. సూపరింటెండెంటుకు చెట్టు అడ్డం లేకపోతే అప్పుడే అతడు ప్రాణం కోల్పోయేవాడు.

ఆజాదుకు తగిలిన దెబ్బతో అతని తొడలోని ఎముక విరిగిపోయింది. అందుచే అతడు లేవలేకపోయాడు. వెంట నున్న సహచరుడు ఆజాదును వదలి ప్రాణభీతితో కాలికి బుద్ధిచెప్పాడు.

ఆజాదు ఆ పార్కులో వున్నట్లు వీరభద్ర తివారీ అను ద్రోహి (ఒకప్పుడు పార్టీసభ్యుడే) ఎట్లో కనిపెట్టి పోలీసుల కెరింగించాడు. డి. ఎస్. పి. వెనుకనే పోలీసు సిబ్బందికూడ బయలుదేరింది.

ఆజాదు దెబ్బతిని పారిపోవీలులేక ఏకాకియై అట్లే సూపరింటెండెంటుపైకి గుండ్లవర్షం కురిపిస్తున్న సమయంలో విశ్వేశ్వరసింగను సబ్ ఇన్స్పెక్టరు వేన్నుంచి వచ్చి ఆజాదుకు గురిచేసి కాల్చాడు. ఆజాదుకూడ పడుకొనివుండే గుండుకు గుండుతో జవాబిచ్చాడు. ఆజాదుగుండుతో విశ్వేశ్వరసింగు దబ్బ వదావదలయింది. అనంతరం చాలామంది పోలీసులు వచ్చి చుట్టూ ముట్టడించి అన్ని వైపులనుండి ఆజాదుపైకి గుండ్లవర్షం కురిపించారు. ఆజాదు ఆ అసహాయ

స్థితిలో ఒక్కడే ప్రాణం పోయేవరకు పిస్తోలుతో ఎదుర్కొని పోరాడాడు. అంతులేని శత్రువుల గుండ్లతో అతని శరీర మంతా తూట్లుపడిపోయింది. ఆ వీర ఆజాదు వీరుడుగానే ప్రాణం వదలాడు. ప్రాణంపోయినా పోలీసు లతని దరిచేరు టకు గడ గడలాడారు. ఒక్కడికీ గుండెలేకపోయింది. ఆజాదు శవం కదలకపడివున్నా వారికి భయమే. మళ్ళీ ఫైర్ చేసి చూశారు. కొనవూపిరి వున్నా జవాబిచ్చితీరుతాడనే వారికి నమ్మకము.

ఈవిధంగా ఆజాదు హతుడైనాడు. అంతిమ శ్వాస వరకు అతడు తన ప్రతిన నెరవేర్చుకున్నాడు. సామ్రాజ్య శక్తి అతన్ని ప్రాణంతో పట్టలేకపోయింది. ఆజాదు హోమ వీరుడు! ఆ స్వాతంత్ర్యమూర్తిలో అపూర్వక్రియాశక్తి, అస మాన త్యాగం, అద్భుత సాహసం నిండివున్నై. టెర్రరిస్టు యుగంలో కడపటి చక్రవర్తి. అతని అవసానంతో వ్యక్తిగత హింసావాదమే అంతరించిపోయింది. ఆజాదు ఆజ్ఞ మాత్రం శిలాశాసనంలాగుంది. అతని అనుచరులు నేడు ఆజాదు అంతిమ సందేశా న్ననుసరించి పీడితప్రజలమధ్య పని చేస్తూనే వున్నారు. ఆజాదు లక్ష్యాన్ని— కార్మిక - కర్షక సముద్ధరణను సాధించితీరుతారు.





# బాలవిజ్ఞాన సాహిత్యము

| | | |
|---|---|---|
| మన నగరాలు | రెంటాల | |
| | 4 భాగాలు - ఒక్కొక్కటి | 0.87 |
| మన చారిత్రక ప్రదేశాలు | ,, ,, | 0.87 |
| మన నదులు | ,, ,, | 0.87 |
| మన పుణ్యక్షేత్రాలు | దంటు కృష్ణమూర్తి | |
| | 2 భాగాలు - ఒక్కొక్కటి | |
| నీటి కథ | భరద్వాజ | |
| గాలి కథ | ,, | |
| పింగాణి కథ | ,, | |
| అద్దం కథ | ,, | 0.50 |
| న్యాయ తీర్పులు | పి. సుబ్బారావుశాస్త్రి | 1.00 |
| ఆనంద మందిరం | తం. పాండురంగ శర్మ | 1.25 |
| స్వామి - స్నేహితులు | ఆర్. కె. నారాయణ్ | 2.00 |
| కులాసా కథలు | విరించి 2 భాగాలు | 1.26 |
| సంఘ జీవనం | డా. గుం. రాధాకృష్ణమూర్తి | 0.80 |
| ఆరోగ్యమే మహాభాగ్యం | ,, | 1.00 |
| రంగుల కథ | భరద్వాజ | 0.50 |
| గడియారం కథ | ,, | 0.50 |
| గ్రహాల గాథలు | ,, | 0.50 |
| నక్షత్రాల చిత్రాలు | ,, | 0.50 |



**ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ - 2.**

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B107 |
| పుస్తకం పేరు | మనవీరులు 03 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CF, 56, BCE, 4 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినవారు | Habeeba |
| పేజీలు విడదీసినవారు | Rohith |
| స్కాన్ చేసినవారు | Su Smitha |
| పరీక్ష చేసినవారు | RUKSANA |
| పేజీలు సరిచూసినవారు | |
| బైండింగు చేసినవారు | |
| ప్యాకింగు చేసినవారు | |
| పరిస్థితి | good |